# కవితా సంకలనం

ప్రచురణ:




రిజిస్టర్డ్ నెం. 164

**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

**SWARALU**
AN ANTHOLOGY OF POETRY

యువభారతి

ప్రచురణ : 11

ప్రథమ ముద్రణ : 2,200 ప్రతులు
ఏప్రెల్ 4, 1973.

ముఖపత్ర రచన, అక్షరాలంకరణ :
సుధామ

ముద్రణ :
విజయశ్రీ ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :
విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-500003.

కార్యాలయం :
యు వ భా ర తి
ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్డు, హైద్రాబాదు - 50^001

వెల : మూడు రూపాయలు

# ప్రస్తావన



'యువభారతి' సభ్యులలో ఇరవై నలుగురి రచనలను 'స్వరాలు' అనే కవితా సంకలనంగా తెలుగు పరిత్యలోకానికి 'ప్రమాదీచ ఉగాది' సందర్భంలో సమర్పించుకో గలుగుతున్నందుకు మా కెంతో సంతోషంగా ఉంది.

మా దశమ వార్షికోత్సవ సందర్భంగా హర్షంతో రసవీణపై ప్రమోయించిన ఈ 'స్వరాలు' యువభారతి పదకొండవ ప్రచురణ. ఐదవ వార్షికోత్సవ సందర్భంగా యువభారతి అందించిన 'వీచికలు' అను కవితాసంకలనం సహృదయులను కదలిం చింది. వ్రాసింది నలుగురైనా పలువురి ప్రశంసా వీచికలనందుకున్నారు. కవితా సంకలన ప్రచురణలో అది మొదటిదైనా యువభారతికి మోదాన్నే కలిగించింది. అష్టమవార్షికోత్సవ సందర్భంగా సృష్టించిన మరో కవితాసంకలనం "అక్షరాలు". పదమూడు కలాలు భావావేశంతో కదలగా రూపొందిన ఆ "అక్షరాలు" నక్షత్రాల్లా సాహితీవిహాయసంలో సరికొత్త కాంతిరేఖలను విరజిమ్మినవి. రెండవ కవితా సంకలన మైనా 'అక్షరాలు' యువభారతీయులకు ఉత్సాహాన్ని ఉల్లాసాన్ని ప్రత్యక్షంగా చూపిం చింది. ఒక వసంతంలో 'వీచికలు'గా కదలి మరో వసంతంలో 'అక్షరాలు' తీర్చుకొని ఈ వసంతంలో 'స్వరాలు' పలుకుతున్నారు యువభారతీయులు. ఈ విధంగా ముద్రిత మైన యువభారతీయుల కవితాసంకలన ప్రచురణలలో ముచ్చటగా ఇది మూడవది. పదవ వార్షికోత్సవ ప్రచురణలో మొదటిది.

యువకులలో ఆలోచనాసక్తిని, అనర్గళవచోయుక్తిని, అనవరత రచనాశక్తిని పెంపొందించి వారిలో గుప్తంగానున్న సృజనాత్మక సామర్థ్యాన్ని నిరంతరం నిర్మాణైక దృక్పథంవైపు ప్రసరింపజేయడానికై గడచిన పదేండ్లనుంచి ఒళ్లువంచి సాహిత్య కృషిని సాధిస్తున్న సంస్థ యువభారతి. ధనం లేదు యువభారతికి. ఐనా అహో రాత్రాల సాధనం లేకపోలేదు. ధనంకోసం కాదు — క్రొత్తదనం కోసం — ఉత్సాహమే ఊపిరిగా ముందుకు నడుస్తున్నది. యువత ఉన్నంతకాలం నవతకు లోటులేదని, సౌజన్య మున్నంతకాలం సమతకు లోపం రాదని, నిధులు చేయలేని పనులు ఎదలు చేస్తాయని గుండెలు కలిస్తే అమృత భాండాలు అవే నడిచివస్తాయని విశ్వసిస్తున్నది యువభారతి.

యువభారతి కేవలం ప్రచురణ సంస్థ కాకపోయినా సభ్యులను, సంస్థకు సహకారంతో పాటు అనుక్షణం ఆత్మీయతనందిస్తున్న సహృదయులను ప్రోత్సహించి జనావళికి వారి ప్రతిభావైభవాన్ని పరిచయం చేయడానికి ప్రయత్నిస్తున్నది. ఈ 'స్వరాలు' మా ఈ ప్రయత్నానికి మూడవ నిదర్శనం. ఈ కవితాసంకలనంలోని యువభారతీయులలో ఐదుగురు కవయిత్రులు కూడా ఉన్నారు. ఇందులోని ఇరవైనలుగురు కవులలో పదకొండుమంది 'అక్షరాలు'లో పఠితలకు పరిచయమైనవారే. ఈ సంకలనంలో వివిధకవుల భావగీతికలకు అనుగుణంగా స్వరకల్పన చేసే ప్రయత్నం జరిగింది. సమకాలీన సమాజవాతావరణం ఈ కవితావరణం ఈ కవితాసంకలనంలో రవళిస్తుంది. ఇప్పుడిప్పుడే కవితారంగంలో ప్రవేశించిన వారేకాక ఇదివరకే వివిధ పత్రికలలో తమ రచనలను ప్రచురించి కవులుగా పేరు గడించుకున్నవారు కూడా ఈ సంకలనంలో ఉన్నారు. సరస కవితావసంత వాటికలో విహరిద్దామనే ఉత్సాహంతో ఈ 'స్వరాలు'లోని కవులు కలం పట్టినారు కుతూహలంతో గళమెత్తి క్రొంగొత్త స్వరాల నాలపించినారు.

సహృదయ హృదయాలను కదలించగలగితే మురిపించి మరపించగలిగితే మా ఈ కృషి ఫలించినట్లు—ఈ వసంతోద్యానంలో గళమెత్తి పాడిన కవికోకిలల స్వరాలు భావ భాస్వరాలైనట్లు. అప్పుడు యువభారతి ఈ 'స్వరాల'ను శర వరాలుగానే గాక సరికొత్త వరహాలుగా భావిస్తుంది.

తెలుగువారికి ముచ్చటైన మొదటి పండుగ ఉగాది. వెలుగుల ఆశావసంతాలకు అది పునాది. ఉగాదినాడు యువభారతి రెండు కవితాసంకలనాలు—'స్వరాలు'—'ఉషస్సు' లను, శ్రీ శిలా వీర్రాజుగారి ప్రయోగాత్మక వచన కవితాగ్రంథం—'మళ్ళీ వెలుగు'ను ఆవిష్కరించడానికి సౌహార్దంతో సమ్మతించిన సరస కవితావసంతులు డా॥ సి. నారాయణరెడ్డి గారికి, ఆవిష్కరణ సభకు అధ్యక్షతవహించిన సాహితీ బంధువులు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ కార్యదర్శులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి ఆదరాభిమాన పురస్సరంగా అభివందనాలు.

ఈ సంకలనంలో ప్రచురించడానికి తమ రచనల నందించి హార్దికంగా ఆర్థికంగా తోడ్పడిన 'స్వరాలు' కవుల సౌహార్దాన్నీ ఔదార్యాన్నీ మరువలేము.

ఎన్నో గళాలు పల్కిన భిన్నస్వరాలను ఎంతో ఓపికతో విని ఉదయించిన ఆ రవళి హృదయాలకు విందు చేసేలా సవరించి పీఠికారూపంలో తమ వెలలేని భావాలను వెలువరించిన సహృదయ మూర్తులు యువభారతి ప్రధానసంపాదకులు అయిన

డా॥ జీ. వి. సుబ్రహ్మణ్యం గారికీ, మా ఈ కృషిలో అహర్నిశలు ఆత్మీయంగా కార్యాన్ని పర్యవేక్షించ తోడ్పడిన యువభారతి అధ్యక్షులు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారికీ, ఈ సంకలన ప్రచురణకు రూపకల్పన చేసి తమ శక్తియుక్తులను ధారపోసిన మా యువభారతి సమావేశకర్తలు శ్రీ వంగపల్లి విశ్వనాథంగారికి మేమెంతో ఋణపడి యున్నాము.

'స్వరాల'కు పుస్తకాకృతి నిచ్చే బాధ్యతను నిర్విఘ్నంగా నిర్దుష్టంగా నిర్వహించిన శ్రీ ఏ. నాగేశ్వరరావుగారికి మా హార్దికాభివాదాలు.

కుంచెను పంచదారలో ముంచి 'స్వరాలు' ముఖపత్రాన్ని సౌందర్యభాస్వరంగా చిత్రించిన శ్రీ 'సుధామ'కు మా ధన్యవాదాలు.

ముఖచిత్రాన్ని అచ్చొత్తిన విస్టాస్ ప్రింటర్సు వారికీ, సకాలానికి కవితా సంకలనాన్ని అచ్చువేసిన విజయశ్రీ ప్రింటిగ్ వర్క్సు, ఏ. సూర్యనారాయణ గారికి మా కృతజ్ఞతలు.

ధరలో మేలిమి బంగారంతో పోటీ పడుతున్న వెండికాగితాన్ని సరసమైన ఖరీదుకు అందించి సహకరించిన శ్రీ ఆర్. ఎమ్. త్రివేది అండ్ సన్స్ వారి శ్రీ రాజమణిగారికి మా కృతజ్ఞతలు.

యువకులలో సమపాళ్ళలో ఒకవైపు చైతన్యాన్ని వెల్గించాలని మరోవైపు సౌజన్యాన్ని కల్గించాలని మేధకూ హృదయానికీ పూలవంతెన వేయాలని, మస్తకానికి పుస్తకానికీ మధ్య మమతను పెంపొందించాలని యువభారతి యధాశక్తి కృషిచేస్తున్నది. సహృదయులు సహకరిస్తే ఎన్నెన్నో సాహిత్య కార్యక్రమాలను ఏర్పాటు చేసి ప్రశస్తమైన పుస్తకాలను అందించి వెలలేని రసవసంతాలను వెలయించాలని ఆకాంక్షిస్తున్నాం.

తిరుమల శ్రీనివాసాచార్యులు
విశ్వనాథ సూర్యనారాయణ

యువభారతి

ప్రమాదీచ ఉగాది,
4_4_1973.

# మా గురించి




ప్రతిభా కళిక వికసనం పొందడానికి తన పరిమళాలను వెదజల్లి దీప్తం వ్యాప్తం కావడానికి అనువైన వాతావరణం ఏర్పడినప్పుడే సమాజం సజీవంగానూ, నిత్యనూతనంగానూ, నిర్మాణాత్మకంగానూ, అభ్యుదయ పథంలో సాగిపోగలుగుతుంది.

యువతరంలో నిర్మాణైక దృక్పథాన్ని, అధ్యయన శీలతను, పరస్పరావగాహనను, పెంపొందించ గలిగితేనే ప్రజాస్వామ్య వ్యవస్థకు సుస్థిరమైన పునాది ఏర్పడుతుంది. ప్రజలను సమీకరించడానికి రాజకీయోద్యమాలు తాత్కాలికంగా కారణమౌతాయేమోగాని, నిరంతరం సభ్యతా మర్యాదలూ, ప్రేమానురాగాలూ, సాహిత్యోద్యమం వల్లనే రూపొందుతాయనడం యథార్థం. పుస్తకాలను చదివించి పాఠకులకూ రచయితలకూ మధ్య సద్భావ సేతువును నిర్మించి పఠనాసక్తిని పెంపొందిస్తే సాహిత్య ప్రయోజనం సమకూరుతుందని యువభారతి విశ్వాసం. గత పదేండ్లుగా యువభారతి వివిధ ఉపన్యాస, పుస్తక ప్రచురణ, గోష్ఠి, సమీక్షావ్యాస సంకలన ప్రచురణలే కాకుండా ప్రతిమాసం రెండుమార్లు సమావేశమై సంస్థ సభ్యుల్లో నిద్రాణంగా ఉన్న సృజనాత్మక శక్తులను ప్రేరేచి, ఉద్దీప్తం చేయడానికి రకరకాల సాహితీ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

ఆలోచనా స్వేచ్ఛను దేశపురోగతికి తోడ్పడేవిధంగానూ, సృజనాత్మక రచన ప్రతిభాసమున్మేషణానికి దోహదంగానూ, వ్యక్తిత్వ నిర్మాణం దేశ నిర్మాణంతో పెనవేసుకొని పోయే విధంగానూ, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించాలనే దృఢ సంకల్పంతో యువభారతి వివిధ కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది.

ఇటీవలనే యువభారతి ప్రారంభించిన 'సాహితీమిత్ర' పథకం యావద్భారత దేశంలోని తెలుగు సాహితీప్రియుల సహకార సద్భావాల ఊతగా తీసుకుని సాహిత్య కార్యక్రమాలను నిర్విఘ్నంగా నిర్వహించడానికి రూపొందించబడ్డది. దేశంలో తెలుగు రసికుడు ఎక్కడున్నా సరే! అతడు యువభారతికి తోడ్పడగలుగుతున్నాననే తృప్తి పొందేట్టుగానూ దీనికి రూపకల్పన చేయబడింది. ఇంతవరకూ 1,500 మంది సాహితీ మిత్రులుగా చేరి యువభారతి కార్యకలాపాలపట్ల తమ తృప్తిని, విశ్వాసాన్ని ప్రకటించారు.

ప్రాచీన అర్వాచీన సాహితీ మర్యాదలతో పఠితృలోకానికి పరిచయం చేయ డానికి సమకాలీన సమస్యల పరిజ్ఞానం కలిగించడానికి, యువభారతి ఇంతవరకు 'కావ్యలహరి', 'చైతన్యలహరి' 'రచన' 'మహతి' గ్రంథాలను ప్రచురించి సాహితీ ప్రియుల మన్ననలను, విజ్ఞుల ఆశీస్సులను, పొందగలిగిందని సవినయంగా మనవి చేస్తున్నాం.

సాహితీమిత్రులను ఒక ప్రాంగణంలోకి తీసుకురావడానికి, సాహితీమిత్రుల కవితా సంకలనం 'ఉషస్సు' ఈ ఉగాదినాడు వెలువరిస్తున్నాం. 'యువభారతీయు'ల కవితాసంకలనాలు 'వీచికలు' 'అక్షరాలు' ఇంతవరకు వెలువడ్డాయి. ఉగాదినాడు వెలువడేది 'స్వరాలు'. మాకు ఆప్తులూ, కవితాప్రతిభా సంపద్యుక్తులూ అయిన శ్రీ శీలావీర్రాజు గారి వచన కవితాప్రయోగం 'మళ్ళీవెలుగు'ను ఈ ఉగాదినాడే వెలువరిస్తున్నాము.

తెలుగుజాతిని తమ సాహిత్యంద్వారా, మహోదాత్త జీవితంద్వారా ఉద్దీప్తం చేసిన మహామనీషులు నన్నయ, పోతన, పింగళి సూరన, కందుకూరి వీరేశలింగం, తిరుపతి వేంకటకవులపై విజ్ఞులచేత ఉపన్యాసా లిప్పించి వాటికి 'వికాసలహరి' అనే పుస్తకరూపం కల్పించి సాహితీమిత్రులకు ఉచితంగానూ, ఇతర సరసులకు ప్రచురణపూర్వ విరాళానికి అందించడానికి ప్రణాళికను సిద్ధంచేశాము.

వివిధ రంగాలలో యువకులు నిర్వహించిన, నిర్వహించవలసిన పాత్రనుగూర్చి ఒక గోష్ఠి కార్యక్రమాన్ని నిర్వహించడానికికూడా పథకం సిద్ధమైంది.
ఒక క్రమబద్ధమైన పద్ధతిలో విశాల దృక్పథంతో, నిర్మాణైక బుద్ధితో యువభారతి ముందుకు సాగిపోతోంది. సాహితీప్రియుల, సాహితీమిత్రుల ఆదరాభిమానాలతో, అండదండలతో సమాజంలో రాసిక్యాన్నీ, సహనభావాన్నీ, సౌందర్యపిపాసనూ, దేశభక్తినీ ఉద్బుద్ధం చేయడానికి ప్రయత్నం చేస్తుంది.

చైతన్యపూరితమైన ఆశయసాధనా సంరంభాన్ని జడమైన అచ్చుసిరాద్వారా అందించగలగడం కష్టం. సహృదయులు దీని వెనుకనున్న చైతన్యస్రవంతిని పోల్చుకో గలరనీ, వారి సహాయ సహకారాల నందించగలరని

విశ్వాసంతో,

ఇరివెంటి కృష్ణమూర్తి.

యువభారతి




# సాహితీమిత్రులు
# ❋ యువభారతి




స్పందనం జీవలక్షణం ।

రసస్పందనం సహృదయలక్షణం ।

మా కృషిలో పాలుపంచుకునేందుకై సహృదయులైన సాహిత్యాభిమానులకు అందిస్తున్న ఆహ్వానం 'సాహితీమిత్ర'. జాతి పురోగమనానికి సాహిత్యవికాసం, దాని ప్రభావం అవసరమని భావిస్తూ ఉత్తమ సాహిత్య ప్రచురణానికి యథాశక్తి ప్రయత్నిస్తున్నాము. 'సాహితీమిత్రులు'గా చేరడం అంటే మీ సహాయ సహకారాలను మా సాహిత్యకృషికి అందించటానికి ఒప్పుకుంటున్నారన్నమాట ! యువభారతి సాహితీమిత్రులుగా చేరడంవల్ల సమకూరే సదుపాయాలు :

* ప్రతి సంవత్సరం అయిదు రూ॥ చెల్లించడంతో యువభారతి సాహితీమిత్రులుగా పరిగణింపబడతారు. సాహితీమిత్ర సభ్యత్వ చిహ్నం అందుతుంది.

* తక్షణమే ఒక ఉచిత పుస్తకం. 1973 వ సంవత్సరంలో రు. 3/– ల ప్రచురణ పూర్వ విరాళంపై ప్రచురింపబడే 'వికాసలహరి'ని మీకు ఉచితంగా – నేరుగా అందించడంగానీ, పోస్టుద్వారా పంపడంగానీ జరుగుతుంది.

* 1973 లో యువభారతి నిర్వహించే కార్యక్రమాల వివరాలు, ఆహ్వానాలు అందుతాయి.

* 1973 లో మీరు యువభారతి ప్రచురణలను 25% మినహాయింపుతో – కొన్ని సమయాలలో అంతకన్నా ఎక్కువ మినహాయింపుతో మీరు సొంతం చేసుకోవచ్చును.

* అన్నింటికన్న మిన్న యువభారతికి తోడ్పడగలుగుతున్నామన్న సంతృప్తి, మీకా సంతృప్తి కలిగించేలా, యువభారతిని తీర్చిదిద్దడంలో మీ సహకారం అందించటం.

# వికాసలహరి

జాతి సర్వతోముఖ వికాసానికి సాహిత్యం శక్తిమంతమైన సాధనం. పది శతాబ్దాల తెలుగుసాహిత్య చరిత్రలో సాహితీ జగత్తును సమకాలీన సమాజ భవిష్యత్తును వికాసలహరిగా పొంగించిన సారస్వత మూర్తులు ఎందరో ఉన్నారు. వారిలో పంచరత్నాలను ఎంచుకొని యువభారతి ఈయేడు సాహితీ సమాలోచన కార్యక్రమాలను ఉపన్యాస లహరిగా 'వికాసలహరి' గ్రంథప్రచురణగా నిర్వహింప దలచుకొన్నది.

గాసట బీసటలుగా కథలనల్లుకొంటున్న ఆంధ్రజాతికి ఆదికావ్య నిర్మాణ వికాసాని కల్పించిన నన్నయ, గీర్వాణ భాగవతాన్ని తెలుగు ప్రజానీకానికి భక్తిరసాయనంగా అందించి ప్రజలలో కవితావికాసాన్ని సాధించిన ప్రజాకవి పోతన, సమగ్ర కావ్యకళావిష్కారాన్ని కళాపూర్ణోదయంగా కల్పించి, వాస్తవిక జగత్తుకూ కల్పనామహత్తుకూ, జీవితసత్యాలకూ, కావ్యకళాలక్ష్యాలకూ నూత్న వికాసోల్లాసాన్ని కల్పించిన పింగళి సూరన, నవ్యసాహిత్య ప్రక్రియా విలాసానికీ, నవ్యసమాజ సంస్కృతి వికాసానికి వాఙ్మయాన్ని సవ్యసాచిలా ప్రయోగించి ప్రగతిని సాధించిన వికాసమూర్తి కందుకూరి వీరేశలింగం పంతులు, పరభాషా సాహిత్యాల ప్రభావంతో పరాఙ్ముఖమైన జాతిని మాతృభాష వైపు మరలించి పద్యాన్ని శ్రవణానందంగా ఆలపించి, కవితాప్రవృత్తికి జాతిలో పునర్వికాసాన్ని కల్పించిన తిరుపతి వేంకటకవులూ యువభారతి ఎన్నుకున్న సారస్వత మూర్తులు.

సమకాలీన సాహిత్య రథసారథులు, బుధశేఖరులూ వారినిగూర్చి ప్రసంగించే ఉపన్యాసకులు :

| | | |
|---|---|---|
| 7 అక్టోబరు 73 | నన్నయ | ఆచార్య దివాకర్ల వేంకటావధాని |
| 21 అక్టోబరు 73 | పోతన | డా॥ సి. నారాయణరెడ్డి |
| 4 నవంబరు 73 | పింగళి సూరన | డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం |
| 18 నవంబరు 73 | కందుకూరి వీరేశలింగం | ఆరుద్ర |
| 2 డిసెంబరు 73 | తిరుపతి వేంకటకవులు | ఆచార్య దివాకర్ల వేంకటావధాని |

" వికాసలహరి " 2 డిసెంబర్ '73 నాడు ఆవిష్కరింప బడుతుంది. ప్రచురణ పూర్వవెల 3_00. 1973లో సాహితీమిత్రులుగా చేరేవారికి వికాస లహరి ఉచితం యు భారతిలో సాహితీమిత్రులుగా చేరి, సాహితీ వికాసానికి దోహదం చేయండి.

# స్వర మేళ

—డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

"ఉండాలోయ్ కవితావేశం !
కానివోయ్ రసనిర్దేశం !
దొరకదటోయ్ శోభాలేశం !
కళ్ళంటూ ఉంటే చూసి,
వాక్కుంటే వ్రాసి"

అన్నాడు అభ్యుదయ కవిచక్రవర్తి శ్రీశ్రీ. కళ్ళంటూ ఉంటే లోకాన్ని నిశితంగా చూడాలనీ, వాక్కంటూ ఉంటే అందంగా పలకాలనీ, రమణీయంగా అవిష్కృతమయ్యే వాక్కుకు కవితావేశం కావాలనీ, అది కవితలో రసనిర్దేశం చెయ్యాలనీ శ్రీశ్రీ ప్రబోధం. ఇది ఏకాలానికైనా, ఏ తరానికైనా పనికొచ్చే సూక్తం !

అందుకే 'యువభారతి' 'స్వరాల'ను మ్రోయిస్తున్నది. ఇరవై నలుగురు యువకవులు హృదయ తంత్రులను మీటి పలికించిన స్వరాలివి. చుట్టూ ఉన్న లోకాన్ని లోచూపుతో చూచి 'మనసు నిశ్శబ్దంగా పడుతున్న ఆరాటానికి' 'అక్షరాకృతి' కల్పించిన స్వరాలివి.

నేటి సమాజంలో మధ్యతరగతి మేధావివర్గానికి ప్రాతినిధ్యంవహిస్తారు 'స్వరాల' కవులు. జీవితం తమకిచ్చిన అనుభవాన్ని ఖచ్చితంగా చెప్పేయాలనీ, మృగతృష్ణలా ఎంతదూరం పోయినా చేతికందని శాంతికాసారాన్ని కష్టసాధ్యమైనా అన్వేషించాలనీ, విప్లవంలోని విధ్వంసాన్నీ, మానవత్వంలోని దానవత్వాన్నీ, అభ్యుదయ నినాదంలోని ఆగ్రహావేశాన్నీ పరిహరించాలనీ, పరిష్కరించాలనీ యీ యువతరం ఉవ్విళ్ళూరుతున్నది. కలాన్ని కరవాలంలా ఝళిపించినా కళాసౌందర్యాన్ని కమనీయంగా పరిపోషించుకోవాలనీ, 'అడుగువేసే ముందు అరక్షణం ఆలోచించా'లనీ, 'కాలం కాటు వేసినా కడసారి చిరునవ్వు' చిందించాలనీ ప్రయత్నిస్తున్నదీ కవిగణం.

'ఓ కావ్యకన్నికా ! సౌకుమార్య మెరుంగని వజ్రలేఖిని నాది' అని గద్దిస్తూనే 'కాదనక దానితో కరుణతోడ కదలిపొమ్మ నీ పథమ్మున పూలరథమ్ములోన' అని అనునయిస్తాడు స్వరాల కవి. అతని భావనలో 'మనిషికి చిహ్నంగా, మనసుకు ముకురంగా నిలుస్తుంది....కన్నీటి చుక్క'. 'రేపటి స్వర్గానికి—ఇప్పటి నరకంలో' మనిషి పొందే 'వేదన'కు కన్నీటిచుక్క ప్రతీక. 'గిటారుమీద ప్రవహించనీకు గ్లిజరినోద్భూత సంగీతం.....ఓదార్పుచితి నోచుకోని అనాధ ప్రేత కానీకు అశ్రుకణాన్ని'—అని స్వరాల కవి యువలోకాన్ని హెచ్చరిస్తున్నాడు. 'వికసించిన కుసుమం కాదు—జీవితం ఆనందంగా ఆఘ్రాణించ టానికి; వడ్డించిన విస్తరికాదు—జీవితం, ఆతురతతో ఆరగించ టానికి'—అన్న సత్యాన్నిగుర్తిస్తూ 'నిన్న ఏమీ మిగల్చనప్పుడు—నిన్నటిలాగే 'రేపు' అని

తెలిసినప్పుడు, వేదనను దిగమ్రింగుతూ వెర్రిగా సామాన్యుడు నవ్వుకుంటున్న వేళ— ఈ వేళ—ఎంత దీనంగా ఉంది' అని వ్యాఖ్యానిస్తున్నాడు. 'ఈపలివైపు సంధ్య ఆపలి వైపు ఉషస్సు....కళ్ళు నులుపుకుంటూ చూస్తున్నాడు'.

'ఇదంతా పిడివాదయుగం. ఎవరినెంతవరకు పిడికిల్లోంచి జారకుండా వాడుకోవాలో బాగా తెలిసిన యుగం'—అని సమకాలీన సాంఘిక స్వభావాన్ని సమీక్షిస్తూ, 'ఈ నాడే కాదుకదా ఏనాడూ దేశానికి ప్రజలేరా సర్వస్వం. ఋజువైనది ఈ సత్యం. ముందు చూపుతోడ సాగు. అందునులే ఫలం బలం' అని ప్రబోధిస్తున్నాడు.

చుట్టూ ఉన్న చీకటిని చూచి నిందిస్తూ కూర్చుండేకన్న పట్టుమని ఒక్క చిన్న దీపం వెలిగించటమే తమ కర్తవ్యంగా ముందుకు సాగుతున్న 'యువభారతీయు'ల కలాల్లో వెలుగులు దివ్వెలుగా నవ్వుతున్నాయి. తాము వెలిగించే దివ్వెల వెలుగుల విలువ—చీకటి విలువకూడా తెలిస్తేగాని—అర్థంకాదని వీరి దృక్పథం. 'చీకటి విలువే వెలుగును వెతుక్కోమంటుంది. వెలుగునకు నిర్వచనం చీకటని తెలిస్తేనే తప్ప తెలియదు కనక' అని స్వరాల కవులు వినదిస్తున్నారు. దానికనుగుణంగా—'పేద వారి హృదయాలను పరిశోధిస్తూ, స్పర్శిస్తూ, కాగడాలు వెలిగిస్తూ పగడాలతో పోలుస్తూ ఛందస్సు లేని కవితను చిందులు త్రొక్కి'స్తున్నారు.

వచన కవితాస్రవంతి శాఖోపశాఖలై విస్తరిస్తున్న ఈ రోజుల్లో తమ కవితా తరంగాలతో స్వరమేళలు కల్పించే రసనిర్ఝరిని పొంగిస్తున్నారీ యువభారతీయులు. సమసమాజ నిర్మాణం ధ్యేయంగా వచన కవులు కవితలో సాధించే సాంఘిక ప్రయోజనం వీరి శ్రుతుల్లో వినపడుతుంది. లక్ష్య సాధనకై రక్తనదులు పారించాలని కత్తులు దూయటం లేదు వీరు. సమాజాన్ని స్వార్థశక్తులు దోచుకుంటున్న దౌర న్యాన్ని గర్హించి, కన్నీటి గాథగా సామాన్యుని బాధను చిత్రిస్తున్నారు. విప్లవాన్ని ఉగ్రమార్గంలో ఉరుకులెత్తించే ఉష్ణం వీరి కలాల్లో కనపడదు. కాని, శాంతి విప్లవం సమాజంలో సాధించాలనే వేడిచూపు వీరి కవితాలక్ష్యంలా కనపడుతుంది. మానవతకు మనుగడ కల్పించే ఏ అభ్యుదయ మార్గమైనా ఈ స్వరాలకవులకు ఉపాదేయంగా నిలబడుతుంది. కవిత కమనీయంగా స్వరాలు మ్రోగిస్తూనే, కరవాలాలు చూపే కదన పాండిత్యాన్ని కరతలామలకం చేసుకోవాలని వీరి కవితా వ్యవసాయం ధ్వనిస్తుంది. 'కన్నీటి చుక్క....కవితాలతను కలకలలాడిస్తుంది.........మహాకల్లోలానికీ తొలిచినుకవుతుం'దని వీరి విశ్వాసం.

'ఎదలోపల ఆవేశం ఒక్కసారి పెరుగుతుంది—మనుషులపై. తెలియరాని కసి యేదో రేగుతుంది— నాకీ మానవలోకంలో కొందరు మనుష్యులు, వాళ్ల స్వాత

కముల జూచి. ఖండించాలని ఉన్నది' అని రుద్రరూపం తాల్చిన స్వరాల కవి 'లోకంపై ద్వేషమ్మును పెంచుట నా అభిమతము కాదు........మనుష్యులను మనుష్యులుగ చూచినపుడె మనిషినినేను' అని వివేకముద్రతో జాతిని వెన్నుతట్టుతాడు. పార్టీకరపత్రంగా రచన నడపలేనంటాడు; కత్తివాదరలా కుత్తుకలు కోయటంలో కూడా మెత్తని కవితాసాధనం మొక్కవోగూడదంటాడు. సంప్రదాయానికి దాసోహమని స్వాతంత్ర్యాన్ని కోల్పోఎనంటాడు. ఇజాల కమ్ముడుపోయి నిజాలను దాచలేనంటాడు. స్వరాలకవి మధ్యతరగతి మనస్తత్వాన్ని మానవతా ధ్యేయంతో మన్నించిన మనిషి. 'హ్యూమానిటీని ఊహించకండి....చూడండి' అని చూచి చెప్పే ద్రష్ట. 'ఆనందం నీ జన్మహక్కు, అణచే అధికారం దేవుడికి సైతం లేదు' అని ఘోషిస్తూ 'తరతరాలుగా నరాలుపగిలే స్వరాలుపాడిన మనిషిని నేనై. రక్తముచిందే ముక్త గీతినై, ప్రకృతి అంతా ప్రతిధ్వనించా, ప్రతిధ్వనిస్తా'నని భవిష్యత్తు కోసం ప్రతిజ్ఞ చేస్తాడు. స్వరాల కవికి ఒక కన్ను సూర్యుడు, ఒకకన్ను చంద్రుడు. 'సూర్యుడెవడనా ప్రశ్న ?–మండు తున్న సమస్య, చంద్రుడు హృదయం. వాణ్ణి వెలగనీ' అంటాడు. చీకటిని చీల్చాలని సూర్యుడు మండుతాడు. అనుభూతిని అందిద్దామని చంద్రుడు వెలుగుతాడు.

స్వరాలలో వెలుగొందే కవితా చరణాలు వెన్నెల కిరణాలు. సుమనశ్శబ్దశ్లేషను ఊతగా తీసికొని పూవుల్లోని పరిమళాన్ని పదాల్లో పొదిగాడు ఒక కవి :

'కనిపించని దేవతకన్నా–వినిపించుకోని విద్వాంసులకన్నా

మా కన్నులకు వెన్నెల రాసే మీరు ఎన్నటికైనా మిన్న"

శబ్దానికి కవితలలో ప్రాణప్రతిష్ఠ చేసే ప్రణవ మంత్రాన్ని కవితా నిఘంటువుగా ఒక కవి సూత్రీకరిస్తాడు :

'నిఘంటువులో శబ్దానికి అర్థం చేతనారహితం
కవిత్వంలో శబ్దానికి అర్థం చేతనాసహితం.

ఉషస్సును ఉత్ప్రేక్షిస్తూ మరొక కవి :

'సూర్యుడితో–జూదమాడి ప్రతి ఉదయం
చుక్కల రాజ్యాన్ని రాత్రి కిరీటాన్ని పోగొట్టుకుంటుంది చీకటి'–

అని రూపచిత్రాన్ని భావనామయం చేస్తాడు :

'నీ వేళ్ళే సున్నితం అనుకోకు నా తీగెలూ సున్నితమే
రెండూ మౌనంగా కలవనీ రసస్సృష్టి జరుగుతుంది'

అని హృదయం భావంతో అన్నదంటాడొక కవితావైణికుడు :

'పువ్వులు రాలుతున్నాయి

రాలిపోయిన పువ్వులు నలుగుతున్నాయి

నలిగిపోయిన పువ్వులు నవ్వుతున్నాయి—

నిజం ఆలోచిస్తే పువ్వులు పువ్వులుకాదు; నవ్వులు నవ్వులుకావు సింబాలిజం. సింగారించాడొక ప్రయోగశీలి :

'కెరటాలవలె కదలు కుచ్చెళ్ళ వెనువెన్క

హంసములవలె రెండు పాదములు నడయాడ'

వాణీలాస్య విలాసాన్ని వర్ణించాడొక మధురకవి :

'నాడు మల్లెతోట, నేడు మధుశాల, రేపు మఠం

—ఎంతచేశావు ? నిన్ను నమ్ముకున్నందుకు—'

అని మూడు రంగుల రేఖాచిత్రాన్ని మూర్తీభవింప చేస్తాడొక త్రీ డైమెన్షన్ కవి:

'అలసిన మనసును సేద తీరుస్తున్నట్లు

ఆ అనునయానికి కనులు చెమ్మగిలేటట్లు

అక్షరాలు కూడా—అనురాగామృతాన్ని

వర్షించగలవంటే—ఏమంటావు నువ్వు ?'— అని ప్రశ్నిస్తుంది ఒక కవి కోకిల :

ప్రణయాన్నీ ప్రళయాన్నీ, కన్నీటినీ పన్నీటినీ, బాధ నూ బోధనూ, ఏటునూ పాటునూ స్వరాల కవి వచనంలో పలికించినా భక్తిని మాత్రం పద్యంలో ఒలికించాడు. అందులో నిర్వ్యాజస్తుతీ కనపడుతుంది—సవ్యాజస్తుతీ కనపడుతుంది. మానవుణ్ణి మాధవుణ్ణీ తేడాలేకుండా ఆరాధిస్తారు. అవసరమొస్తే అధిక్షేపిస్తారు స్వరాల కవులు. అభ్యుదయమంతా ఛందస్సును సన్యసించటంలోనే ఉందని అపోహపడే మైకం ఇంకా వీరిని ఆవరించినట్లు లేదు. ఆ అపోహలనే చీకట్లను చీల్చే చిన్న వెలుగులు స్వరాల్లో వరాల్లా ఉన్నాయి.

యువభారతీయుల ఈ క్రొత్తస్వరాలు మానవతకూ, నవ్యతకూ ప్రాణాలు. సమాజంలోని అపస్వరాలకు మొక్కవోయిన హృదయవీణలు వాడిగా వేడిగా శ్రుతులు మేళవించుకుంటూ మ్రోయించిన సమన్వయ రాగాలు ఈ స్వరాలు. 'యువభారతి' వీణపై సారించి లోకానికందించిన సరిక్రొత్త—స్వరమేళలు :

ఈ స్వరమేళకు రాగసూత్రం—

"మనిషికోసం కవిత్వం

మంచికోరి నవ్యత్వం

నవ్యత్వం ప్లస్ మానవత్వం ఈజిక్వల్టు కవిత్వం—"శ్రీశ్రీ

ఈ లక్షణానికి లక్ష్యం ఈ కవితా సంకలనం.

# పరిచయాలు

ఇరివెంటి కృష్ణమూర్తి

'వీచికలు', 'అక్షరాలు' కవుల్లో ఒకరు.

జననం: 1930. స్వస్థలం మహబూబునగరము. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఎమ్.ఎ. (తెలుగు)పట్టభద్రులు; సికిందరాబాదు సాయంకళాశాలలో ఆంధ్రోపన్యాసకులు.

తిరుమల శ్రీనివాసాచార్యులు

జననం : 1-1-1942, స్వస్థలం: నారాయణపురం, సిరిసిల్ల తాలూకా, కరీం నగర్ జిల్లా. విద్య: ఎమ్.ఎ. వృత్తి: ఆంధ్రోపన్యాసకులు, సర్దార్ పటేల్ కళాశాల సికింద్రాబాదు.

నాగినేని భాస్కరరావు

జననం: 1-11-1949. స్వస్థలం బనిగండ్లపాడు, ఖమ్మంజిల్లా. గాంధీవైద్య కళాశాల, హైదరాబాదులో యం.బి;బి.యస్., ఫైనల్ ఇయర్ విద్యార్థి.

'అక్షరాలు' కవులలో ఒకరు.

సుధామ

అసలుపేరు: అల్లంరాజు వెంకట్రావ్. జననం : 1951. ప్రస్తుతం ప్రాచ్య కళాశాలలో ఆంధ్ర సారస్వతాన్ని అభ్యసిస్తున్నారు. 'వీచికలు', అక్షరాలు కవులలో ఒకరు.

"మనసుకు అందనివీ, తెలియరానివీ ఏ ఉపమానాల ద్వారానో, ఇమేజనరీ వల్లనో సజెషన్స్ వల్లనో ధ్వనివల్లనో ప్రయత్నించి నా అనుభూతులను పదాల్లో భాషలో కూర్చి కవితగా పెట్టే ప్రయత్నం చేసానీ సంకలనంలో, నా అనుభూతికి మీరు దగ్గరవుతే చాలు."

తాళ్లపల్లి మురళీధరగౌడు

వయస్సు 22 సం॥. స్వస్థలం క్రిష్టాపల్లి, ఆదిలాబాదు జిల్లా. బి.కాం. (ఫైనల్) విద్యార్థి. 'అక్షరాలు' కవులలో ఒకరు.

"కవిత్వం ఒక తపస్సు. అది చాలా మహిమాన్వితమైనది. మనశ్శాంతికి, బాధలను మరచిపోవడానికి మంచిసాధనం. అది ఆలోచనాపరిధిని పెంచుతుంది".

### వి. బి. లక్ష్మి

వయస్సు 22 సం॥. స్వస్థలం అనకాపల్లి. బి.ఎస్.సి. పట్టభద్రులు.

'అక్షరాలు' కవులలో ఒకరు.

"ముద్రణాయంత్రం క్రిందపడి నలిగిన నాలుగు అక్షరాలూ నలుగురికి నచ్చేవిలా ఉండాలి".

### వి. వి. సత్యప్రసాద్

జననం: 1944. స్టేట్ బాంక్ ఆఫ్ ఇండియాలో పనిచేస్తున్నారు. బి.కామ్. పట్టభద్రులు. 'అక్షరాలు' కవుల్లో ఒకరు.

### విశ్వనాథ సూర్యనారాయణ

జననం: సెప్టెంబరు, 1952. ఎమ్.ఎస్.సి. విద్యార్థి, స్వస్థలం: పార్వతీపురం, శ్రీకాకుళంజిల్లా. 'అక్షరాలు' కవులలో ఒకరు.

### అల్లంరాజు రాధాకుమార్

జననం: 1948. బి.ఎ. పట్టభద్రులు, సిండికేట్ బాంక్ లో ఉద్యోగం. 'అక్షరాలు' కవులలో ఒకరు.

"అక్షరాలలో దిద్దుకొన్న నాభావాలు, స్వరాలుగా విచ్చుకొని, మీ హృదయాలను రంజింపచేస్తే, నాకవితకు కాసింతయినా సార్థకత లభించినట్లే".

### ఎమ్. రత్నమాల

వయస్సు 22 సంవత్సరాలు. స్వస్థలం: సూర్యాపేట. 'అక్షరాలు' కవుల్లో ఒకరు

### మాడభూషి రంగాచార్యులు

జననం : 25 ఫిబ్రవరి 1941, శంషాబాద్, హైదరాబాదు. బి.ఎ;బి.ఒ.యల్. దక్షిణమధ్యరైల్వే, సికింద్రాబాదులో క్యాషియర్ వృత్తి. ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాచ్యకళాశాలలో ఆంధ్ర సారస్వాన్ని అభ్యసించడమే ప్రవృత్తి.

"ఇదిపాత, ఇదిక్రొత్త అని కవిత్వానికి లేవు. పాతలోనే క్రొత్త ప్రయోగాలు చేసి చూపాలనేది నా ధ్యేయం. 'శృంగారం' రసాభాసయైనా రంజింప గలిగితేచాలు".

## జీడిగుంట కామేశ్వరరావు

జననం: ఆగస్టు 1951. ఎమ్.ఎస్.సి. భౌతికశాస్త్రాధ్యాపకులు.

## ఆచార్య రమ్యశ్రీ

డి. కె. శ్రీనివాసాచార్యులు. జననం: 28_7_1947. బి.ఓ.యల్. ప్రాచ్యలిఖిత గ్రంథాలయము, మరియు, పరిశోధనాలయములో సంస్కృత పండితులు. నఖ చిత్రకారులు.

"అజ్ఞానాంధస్సులో కొట్టుమిట్టాడుతూన్న సమాజాన్ని మేలుకొలిపి, యధార్థ జీవనానికి ఆలవాలమై బ్రదుకు పూబాటలో నడుపునదే కవిత."

## కె. సత్యవతి

వయస్సు: 20 సం॥ స్వస్థలం: హైదరాబాదు, బి.ఎస్సీ (హోమ్‌సైన్స్) పట్టభద్రులు.

"మానవుని మేధస్సుకు విద్యారంభం ఉయ్యాలలోనే జరుగుతుంది. ఉయ్యాల ఊగుతున్న నాకవిత ఏ కొంత మందినయినా కదిలించ గలిగితే అదృష్టమే."

## జి. కుమారస్వామి నాయుడు

స్వస్థలం; బెల్లం గోవిందుపల్లె, చిత్తూరుజిల్లా. వయస్సు: 25 సం॥. ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాలలో ఆంధ్రసారస్వతాన్ని అభ్యసిస్తున్నారు.

"ప్రకృతిని పరీక్షించి ప్రశ్నించి జవాబుకోసం నిరీక్షిస్తూ అన్వేషించునప్పుడు ఆవిర్భవించేది కవిత్వం."

## తల్లాప్రగడ రాజారాం

జననం: 1940. ఎం.ఎ. స్వస్థలం: రాజమహేంద్రవరం. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో ఉద్యోగం.

## శ్రీపతి రఘురామ్‌కుమార్

బి కామ్.,ఏ.ఎఫ్.ఐ.ఐ. జననం : 16_6_43. వృత్తి: ఎల్.ఐ.సి అసిస్టెంటు.

"ఆవేశంవస్తేనే కాని కవితరాదని, ఆవేశంతో రాసినంతా కవితకాదని."

## ఎల్. సుచేత

జననం: మార్చి 1952. బి.ఎస్.సి. (హోంసైన్సు).

"మనసు రెపరెపలాడినప్పుడు_మాటల కూర్పులే కవితేమో."

## వాసు

అసలు పేరు ఎమ్. ఆర్. శ్రీనివాసాచార్యులు జననం: మార్చి, 1939. స్వస్థలం: కోమటిపల్లి, వరంగల్లు జిల్లా. బి. ఎ., డి. ఒ. ఎల్. ప్రభుత్వోద్యోగి.

కవిత్వం: 'రెండువైపులా పదునుగల చక్కని కత్తి'

## ఆచంట అంజని

జననం: జూలై, 1951. స్వస్థలం: రాజమండ్రి. టెలిఫోను ఆపరేటరుగా పనిచేస్తున్నారు.

"సమకాలీన సమస్యల నాధారంగా చేసుకుని, బిగువైన మాటలతో ఎదుటివారి హృదయాల్లో వెంటనే ముద్రవేసుకు పోయేట్టుగా ఉండేదే మంచి కవిత."

## టి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి

జననం: 19_6_1948. ఏలూరుతాలూకా ముండూరు గ్రామం జన్మస్థలం. విద్య: యమ్ ఎస్.సి. ప్రస్తుతం ఇ.సి.ఐ.ఎల్.లో టెక్నికల్ ఆఫీసర్.

## అయ్యదేవర పురుషోత్తమరావు

'అక్షరాలు' కవుల్లో ఒకరు.

జననం; 1933, స్వస్థలం ఎర్రుపాలెం, ఖమ్మంజిల్లా. బి.ఎ. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాదులో ఉద్యోగం.

## పింగళి జగన్నాథరావు

వయస్సు: 27సం॥ ఎమ్.ఒ.ఎల్. చదివారు. ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నారు.

## వంగపల్లి విశ్వనాథం

'వీచికలు', 'అక్షరాలు' కవుల్లో ఒకరు.

జననం: 1941. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి వాణిజ్య శాస్త్ర పట్టభద్రులు. సికింద్రాబాదు కళాశాలలో ఉపన్యాసకులు.

"నా భావాలు ఎదపొరలలోనికి పదిలంగా జారగలుగుతే కనులు చెమర్చగలిగితే సార్థకత చేకూరినట్లే."



"స్వరాలు"

# అనుక్రమణిక

# ఇరివెంటి కృష్ణమూర్తి

## హిమబిందువు

వెలుగుకోసం రేయికార్చిన కన్నీరు
రాత్రి ఓడ్చిన శ్రమోదబిందువులు
రాత్రి కన్నబిడ్డ చిరునవ్వులు
లోకాన్ని వెలుగులో చూడాలని
పుడమికి దిగిన చుక్కలు
ఇంకిపోతున్న చీకటికడలి చివరిబొట్లు
తమోనర్తకి తాండవంలో విరిగిపడిన మౌక్తికాలు
వైతాళికునికి నీరాజనంకోసం
వెలుగనున్న కర్పూరఖండికలు
భువికవతరించిన సహస్ర శక్ర చాపాలు
చైతన్యమూర్తి మిత్రునికి పట్టిన
ప్రకృతి అంజలిలో ఒదిగిన ప్రాలేయ ప్రసూనాలు
నవోషస్సుకోసం తమ మనుగడలను
పణంగాపెట్టిన అమృత జీవనకళికలు

## కన్నీటి చుక్క

కన్నీటి చుక్క....
మంచు మనసును కరిగిస్తుంది.
కవితాలతను కలకలలాడిస్తుంది
మహాకల్లోలానికి తొలిచినుకవుతుంది.
పన్నీటి విలువెంతో తెలుపుతుంది.
ప్రకృతి తల్లికి అద్దంగానిలుస్తుంది.
అమృతంలా బ్రతికిస్తుంది
హాలాహలంలా ప్రజ్వలిస్తుంది.

ప్రణయటీప్తికి హేతువవుతుంది
సంస్కారణోద్యమానికి నాంది అవుతుంది
మహాసాగరంలా నిలుస్తుంది
మహాజీవనదంగా భాసిస్తుంది.
మౌక్తికాన్ని సవాలు చేస్తుంది.
మనిషికి చిహ్నంగా
మనసుకు ముకురంలా
నిలుస్తుంది....కన్నీటిచుక్క.

## అనుకోలేదు

చెమటోడ్చి బీళ్ళుదున్ని
అన్నం పండించినవాడనుకోలేదు
తన పొలం ముక్కలౌతుందని
తనగుండె వ్రక్కలౌతుందని.
కస్తూరి కలయంపిచల్లిన
తన ప్రాంగణంలో
ముళ్ళపొదలు ఉబుకుతాయని,
తాను గొడుగుపట్టిన వాళ్ళు
తనకు పిట్టగొడుగు చూపిస్తారనుకోలేదు.
తన బంగారు స్వప్నాలను
తనవాళ్ళే చెదరగొట్టారనుకోలేదు.
చెట్టు నీడకైనా నోచుకోలేని తాను
వాళ్ళకు చలువమేడలు కట్టించి ఇచ్చాడు.
చల్లగా కూర్చొని తననుద్ధరిస్తారని
తనకిన్ని నీళ్ళైనా అందిస్తారని,
భూతలంలోనే తనకు స్వర్గం సృష్టించి
ఇస్తారను కున్నాడు.

వాళ్లకు హేమపాత్రలో అన్నం పెట్టాడు
తన మట్టిపాత్రను ముక్కలు చేస్తారనుకోలేదు.
వాటాలు కుదరక తగవులాడుకుని
తననుకూడా లాగుతారనుకోలేదు.
పాడిగాదంటే వినరు
ఏకోదరులంటే నమ్మరు
కొట్లాటకు పోట్లాటకు
స్నేహమే పునాది పొమ్మంటున్నారు.
తాను దాచి ఉంచిన నిక్షేపం
దోపిడీదారుల పాలవుతుందనుకోలేదు
తన పాలు విరుగుతాయనుకోలేదు
తన చెమటకు విలువలేదు
తన మాటకు అర్థం రాదు
తనది ముందే కుదువ బెట్టిన బుర్ర
ఇక గుండె ఒక్కటే తనది
అదికూడా వ్రక్కలౌతుందనుకోలేదు.

## ఎవరి నవ్విది ?

ఎవరి నవ్విది ?
ఎంత నిర్మలంగా ఉంది ?
ఎంత శీతలంగా ఉంది ?
ఎంత నిశ్శబ్దంగా ఉంది ?
వెలుగును పంచుతున్న దీపికలా నవ్వును పంచుతున్నది.

ఎవరి నవ్విది ?
ఎంత మెత్తగా ఉంది ?
ఎంత మత్తుగా ఉంది ?
ఎంత కొత్తగా ఉంది ?
అమృతం పంచుతున్న మోహినిలా హాయిని పంచుతున్నది.

ఎవరి నవ్విది ?
ఎంత రహస్యంగా ఉంది ?
ఎంత మర్మంగా ఉంది ?
ఎంత నిర్భరంగా ఉంది ?
రసాన్ని పంచుతున్న సత్కావ్యంలా సుఖాన్ని పంచుతున్నది.
ఎవరి నవ్విది ?
ఎంత రసాత్మకంగా ఉంది ?
ఎంత ప్రబోధాత్మకంగా ఉంది ?
ఎంత సుమార్దవంగా ఉంది ?
చీకట్లతో పోరాడుతున్న తేజంలా
చైతన్యాన్ని పంచుతున్నది.

## కవిత

భావాలకు కాదు
అనుభూతులకు అక్షరాకృతి కల్పించడం కవిత్వం
అనుభూతులన్నీ భాషాబద్ధంకావు; అయినప్పుడు మాత్రం అద్భుతం
ఈ సమ్మేళనమే కవితాసృష్టి
ఇతరులవలెనే కవికికూడా
కష్టాలూ సుఖాలూ, రాగాలూ ద్వేషాలూ
ఆకలిదప్పులూ, ఆశానిరాశలూ ఉంటవి.
ఇవి లేనప్పుడు అతడు మనిషేకాడు
కవికి కలిగిన అనుభూతి
ఇతరుల మనస్సులను, రసార్ద్రం చేయగలిగినప్పుడు
ఊహాధీనం చేయగలిగినప్పుడు
ప్రాణంలేని ఆ శబ్దాలు అర్ధచైతన్యాన్ని పొందగలిగినప్పుడు కవిత్వం అవుతుంది
మంచిచెడులకు అతీతంగావుండి,
ఊహ తట్టినప్పుడల్లా అనుభవంతో కాపురంచేసి
మనసును పరవశంచేస్తుంది
మనసుకు రసరూపం కల్పిస్తుంచది
నిఘంటువులో శబ్దానికి అర్థం చేతనారహితం
కవిత్వంలో శబ్దానికి అర్థం చేతనా సహితం.

# తిరుమల శ్రీనివాసాచార్యులు

## అది ఉగాది

వసంతాలు రాకున్నను
రసాలాలు లేకున్నను
నిశీథిలో ఉషస్సులో
నిఖిలజనం సుఖంకోరి
వ్యంగ్యమధుర గళమ్మెత్తి
మంగళస్వరాల సొత్తు
కవికోకిల కనిపించిన
క్షణమే ఒక నవయుగాది.

గుడిసెలోని బడుగువాళ్ళ
ఎడదల్లో విడిదిచేసి
కరువులనే గ్రీష్మంలో
తరువుల్లా నీడపరిచి
గుండెలోని బొండుమల్లె
ఘుమఘుమలను విందుచేసి
ధనంలేనివారి చల్ల
దనంలోన తేలించెడు
మహాత్ముడు కనిపించిన
మధురక్షణమొక ఉగాది.

వర్షంలో ఘర్షణలో
హర్షంగా శీర్షమెత్తి
వరదల్లో బురదల్లో
సరదాగా తడిసి తడిసి
హలంచేతపూని కుతూ
హలం చివురులెత్త సస్య
ఫలం మనిషి కందించెడు
ఘనతపస్వి కనిపించిన
క్షణమే – ఒక నవయుగాది.

స్వప్నంలో కూడ కనని
చంద్రమండలాంతర్గత
శిలాశకల రాసులనే
ఇలాసలికి దెచ్చి మనిషి
మంచికొరకు మేధస్సును
మథనంచేసెడు విజ్ఞుల
కథనం మనసారవిన్న
క్షణమే — అది ఒక ఉగాది.

## పువ్వుల్లారా !

సుతిమెత్తగా స్థితిని మార్చుకొని
'సుమనస్' అనిపించుకొని
ముద్దుగా మీపేరు వాడుకున్నవారు
ఇద్దరు — వేల్పులూ విద్వాంసులూ.
పదవులకై పదార్థాలకై
ఎదలను కుదించుకుంటారు వీరు
కత్తుల్లోని కాఠిన్యం కాస్త
కలుపుకుంటారు వీరు.
అసూయతో అహంకారంతో
అప్పుడప్పుడు లంకె వీరికి
కప్పురపు కలిమితో చెలిమితో
ఎప్పటికీ సాగే అనుబంధం మీకు.
కాంతివాసనలిచ్చి కరిగిపోయే మీకు
భ్రాంతికీ అశాంతికీ లొంగి విరిగిపోయే వీరికి
ఆ పదం ఎలా అనువర్తిస్తుంది ?
కనిపించని దేవతలకన్నా
వినిపించుకోని విద్వాంసులకన్నా
మా కన్నులకు వెన్నెలరాసే మీరు
ఎన్నటికైనా మిన్న.

నింగిలోని నీరదాల నిస్తులధర్మం మీది
అవనిలోని దీపావళి ఆదర్శం మీది.

ఆరుబయట ఉన్నా అంతఃపురంలో ఉన్నా
నీళ్ళలో ఉన్నా ముళ్ళలో ఉన్నా
నిశిలో ఉషస్సులో
ఎక్కడున్నా ఎంతకాలమున్నా
రెక్కలాడిస్తారు మీరు
వ్యథలో ఉన్నా
మధువులే అందిస్తారు.
మేము వాడుకొనేవరకే కాదు
మీరు వాడిపోయేవరకే కాదు
వాడి వత్తలౌతున్నా
మోడు బ్రతుకులనుగూడ వసంతాల
వాడగా మారుస్తారు.

మాధవునీ మానవునీ
సంపూజించినా సన్మానించినా-
శివునీ శవాన్నీ
అర్చించినా అలంకరించినా-
వినోదమైనా వివాహమైనా
పండగైనా పబ్బమైనా
ఆనందంలో ఆవేదనలో
మీ వృష్టి కావాలి
మీ సమదృష్టి తోడురావాలి.

గుండెల్లో సూదులు గుచ్చినా
గొంతులకు ఉరివేసినా
తొణకని సహనం
గొణగని సంస్కారం
నరులలో సురలలో
నభూతో నభవిష్యతి-
జీవమున్నంత కాలం
సేవ లందించుచే మీప్రకృతి.

సుమకోమలి యైనా
కమలగంధి యైనా
మీ పేరుపెట్టుకొన్నా
మీ సొంపు నింపుకొన్నా

స్వప్నంలో కూడ కనని
చంద్రమండలాంతర్గత
శిలాశకల రాసులనే
ఇలాస్థలికి దెచ్చి మనిషి
మంచికొరకు మేధస్సును
మథనంచేసెడు విజ్ఞుల
కథనం మనసారవిన్న
క్షణమే — అది ఒక ఉగాది.

## పువ్వుల్లారా!

సుతిమెత్తగా స్థితిని మార్చుకొని
'సుమనస్' అనిపించుకొని
ముద్దుగా మీపేరు వాడుకున్నవారు
ఇద్దరు — వేల్పులూ విద్వాంసులూ
పదవులకై పదార్థాలకై
ఎదలను కుదించుకుంటారు వీరు
కత్తుల్లోని కాఠిన్యం కాస్త
కలుపుకుంటారు వీరు.
అసూయతో అహంకారంతో
అప్పుడప్పుడు లంకె వీరికి
కప్పురపు కలిమితో చెలిమితో
ఎప్పటికీ సాగే అనుబంధం మీకు.
కాంతివాసనలిచ్చి కరిగిపోయే మీకు
భ్రాంతికీ అశాంతికీ లొంగి విరిగిపోయే వీరికి
ఆ పదం ఎలా అనువర్తిస్తుంది?
కనిపించని దేవతలకన్నా
వినిపించుకోని విద్వాంసులకన్నా
మా కన్నులకు వెన్నెలరాసే మీరు
ఎన్నటికైనా మిన్న.

నింగిలోని సిరదాల నిస్తులధర్మం మీది
అవనిలోని దీపావళి ఆదర్శం మీది.

ఆరుబయట ఉన్నా అంతఃపురంలో ఉన్నా
నీళ్ళలో ఉన్నా ముళ్ళలో ఉన్నా
నిశిలో ఉషస్సులో
ఎక్కడున్నా ఎంతకాలమున్నా
రెక్కలాడిస్తారు మీరు
వ్యథలో ఉన్నా
మధువులే అందిస్తారు.
మేము వాడుకొనేవరకే కాదు
మీరు వాడిపోయేవరకే కాదు
వాడి వత్తలౌతున్నా
మోడు బ్రతుకులనుగూడ వసంతాల
వాడగా మారుస్తారు.

మాధవునీ మానవునీ
సంపూజించినా సన్మానించినా—
శివునీ శవాన్నీ
అర్చించినా అలంకరించినా—
వినోదమైనా వివాహమైనా
పండగైనా పబ్బమైనా
ఆనందంలో ఆవేదనలో
మీ వృష్టి కావాలి
మీ సమదృష్టి తోడురావాలి.

గుండెల్లో సూదులు గుచ్చినా
గొంతులకు ఉరివేసినా
తొణకని సహనం
గొణగని సంస్కారం
నరులలో సురలలో
నభూతో నభవిష్యతి—
జీవమున్నంత కాలం
సేవ లందించుచే మీప్రకృతి.

సుమకోమలి యైనా
కమలగంధి యైనా
మీ పేరుపెట్టు కొన్నా
మీ సొంపు నింపుకొన్నా

పెడతిమాత్రం
ప్రసూనం అవుతుందా !
సిగలో మిమ్ము తురుముకొన్నంత మాత్రాన
చిత్త సంస్కారం వస్తుందా !

మరి మీరో — పైనాలోనా మెత్తన
మీ రేకు తాకినా — మీగాలి సోకినా
మా ఒళ్ళూ ఉల్లం రెండూ చల్లన.

అందరికీ చిక్కే చక్కని చుక్కలు మీరు
అంతరంగాల సింగారించే కాంతి పుష్కలు మీరు.

అనాదిగా కవులకూ కాంతలకూ
అలంకార కోశాలు మీరు.
అతి సవ్యులకు సైతం
'అప్‌టూడేటు' ఫ్యాషన్లు మీరు.

రాళ్ళు పూలై కడకు
రాజ మందిరాలు చేరినా
పూలు మాత్రం రాలు కాలేవను
నిజం నిరూపించారు మీరు.

మాటలురాని పాపలకు మీ
మనసులోని మాట తెలుసు—ఎలా ?
పసిపాపలటీ మిసిమిపూలటీ
పరమాత్ముని భాషకదా ! అలా !

హృద్యంగా ఎల్లప్పుడూ నవ్వే
ఉద్యోగం మీది
మద్యంగా మిమ్ము వాడుకునే
ఉద్యమం మాది

ఎన్ని జన్మలెత్తినా
మిమ్ముచేరలేం మేము—ఎందుచేత ?
మంటలు మండే మా మనసుల్లో
మధువులు నింపుకోలేం—అందుచేత.

అందుకే ! పువ్వుల్లారా !
చేతులెత్తి మీకు జోతలు చేస్తున్నా
చేతమిచ్చి మిముగూర్చి కైతలు రాస్తున్నా.

## నాగినేని భాస్కరరావు

### చాలని నీడలు ... చావని పీడలు

తీరని ఆకలి
ఆరని దాహం
మీరని బ్రతుకు
చాలని నీడలు
చావని పీడలు
నాలో రేపిన
నాలో ప్రేల్చిన
బీనుల క్షోభలు
హీనుల ఘోషలు
ద్రోహుల హేషలు
అన్నీ కలిసి
అన్నీ పెరసి
మ్రోసిన రావం ఆర్తారావం
వేసినకేక ఏడ్చినకేక
పిలిచిన పిలుపు ప్రగతికి పిలుపు
కొండల, కోనల
అడవుల, మడగుల
అంతా, అంతా
ప్రకృతి అంతా
పరితాపంతో
ప్రతిధ్వనించెను ప్రతిధ్వనించెను.
మీరిన కోర్కెల
హెచ్చిన బ్రతుకుల
బలిసిన కండల
కలిసిన అండల
అందిన దానిని స్వాహా చేసే
దోపిడి వర్గపు
దారుణ సంగరపు జాతికంతకూ
వినబడకేదని వినబడబోవని

ఎక్కడ విన్నా
ఏడ్పులు, గోడులు
ఘోషలు, హేషలు
మానవజాతికి
వినబడలేదని, వినబడబోవని
విప్లవగీతం విశ్వంనిండా
ప్రతిధ్వనించెను ప్రతిధ్వనించెను.
మారణహోమ జ్వాలలలోపల
దారుణ విలయాక్రందన, రోదన.
తరతరాలుగా
నరాలు పగిలే
స్వరాలుపాడిన
మనిషిని నేనై
రక్తముచిందే
ముక్తగీతినై ప్రకృతి అంతా
ప్రతిధ్వనించా, ప్రతిధ్వనిస్తా!
మధ్యందిన
మార్తాండశిఖలలో
నిలువున మండిన
నిలువున ఎండిన
చాలని సీడలు
చావని పీడలు
నాకై విలచెను నాకై నిలచెను.

## వేదన - రోదన

వేదాల వల్మీకం నుండి
వాదాల మర్రివూడలనుండి
పేదవాళ్ళ ప్రేవుల్లోనుండి-వేదన.
సమాజ కపటశాస్త్రవేత్తలు జరుపుతున్న
ప్రయోగాలకు లోతుకుపోయిన మనిషి కళ్ళల్లో-వేదన.
డార్విన్ సిద్ధాంతాలకు
ఋజువుగా జారిపోయి, చితికిపోయి

విద్వత్ విద్యుత్తుల కోల్పోయి
**ఉన్నతుల పాదాలచేత**
దరిద్రపాతాళానికి త్రొక్కబడిన వారిలో—వేదన.
వాడినపువ్వులో—ఓడిన నవ్వులో—వేదన.
వాలిన తలలలో—కాలిన కడుపులలో—వేదన.
రేపటి స్వర్గానికి—ఇప్పటి నరకంలో—వేదన.
వేకువ పాపాయిని ప్రసవించే రాత్రిలో—వేదన.
వేదన పిలిస్తే పలికేది రోదన!

## దేవుడు

దొరలూ, దొంగలూ
నమ్ముతున్న దేవుడు.
దొంగతనానికీ, ధర్మకార్యానికీ
ఒకే మోతాదులో లంచంపుచ్చుకునేదేవుడు.
నిస్వార్థసేవకీ, స్వార్థపరత్వానికీ
ఒకేచోట, ఒకేపీట చూపించేదేవుడు.
పాపభీతితో పామరులు
బ్రతుకుతెరువుకోసం పండితులు
దండాలు పెట్టేదేవుడు.
సృష్టికీ, ప్రతిసృష్టికి
భక్తికీ, ముక్తికీ, శక్తికి
ప్రదాతగా చెప్పబడ్డదేవుడు.
దుష్టశిక్షణలో, శిష్టరక్షణలో
సమర్థుడని పురాణాల్లో స్తుతింపబడ్డ దేవుడు.
దేవాలయాలముందు, అస్పత్రులముందు
రాగుల్ని, రోగుల్ని
కానుకల్ని బొడ్లోదోపుకునే అర్చకుల్ని
చూడలేని కబోది దేవుడు.
జరుగుతున్న అన్యాయాలూ, అక్రమాలూ
కనబడనంతదూరంగా—వినబడనంత దూరంగా
గర్భగుడిలో జడమైపోయిన దేవుడు.
శాస్త్రవిజ్ఞానానికీ, శస్త్రచికిత్సలకూ
శాస్త్రీయ ఆలోచనలకూ, తర్కవితర్కాలకూ
తరిగిపోయి కరిగిపోయినదేవుడు.

అడ్డమైన అనాచారాలకూ
కట్టుబాట్లకూ, అసమర్థతలకూ
రంగురంగుల మేలిముసుగు దేవుడు.
కొందరికి రాముడు, కొందరికి కాముడు
అందరికీ అయోమయం దేవుడు
కొందరికి అయ్యో ! మాయదేవుడు.

## మారని గతి

వానతో ఏడ్చిన ఆకాశం
వెన్నెలతో నవ్వుతుంది
వేర్పాటుకు నడిచిన జనం
తోడ్పాటుకు కదలగలరు.
హింసించెడి సర్పాన్ని చంపేందుకు
చలిచీమల్లో వుంది కట్టుబాటు.
ప్రజాద్రోహివర్గాన్నిక పడగొట్టాలని
అణగారిన జాతులలో వస్తున్నది కట్టుబాటు.
సూర్యుడితో జూదమాడి ప్రతి ఉదయం
చుక్కలసామ్రాజ్యాన్ని, రాత్రికిరీటాన్ని పోగొట్టుకుంది చీకటి
ధనస్వామ్యంపై దాడిచేసి ప్రతిచోటా
దాస్యం సామ్రాజ్యాన్నీ, దరిద్రకిరీటాన్నీ పోగొట్టుకోదేమిటి బీద బ్రతుకు ?
కొండలతో ఢీకొన్న రాళ్ళు
వరదల్లో కలుస్తాయి క్రమేణా ఇసుకరేణువులై
ఎన్నికలకు వోట్లతో ఢీకొని గెల్చినవాళ్ళు
చేతల్లో కలియరేమిటి ఒక్కొక్కడికీ తానొక్కొక్కడై ?
ఆకుల్ని రాలుస్తాయిచెట్లు
కొత్త చివుళ్ళు పుట్టడానికి
అసమానతల్ని వదలదేమిటి ఈ సంఘం
క్రొత్తవ్యవస్థ పుట్టడానికి ?
ప్రతిక్షణం చైతన్య స్రవంతి ప్రకృతి
ప్రతికణం చైతన్య సంజీవని జీవితం
ప్రతిమనసుకు లేదేమిటి చైతన్యం ప్రవృత్తిలో ?
ప్రతిమనిషికి కలుగదేమిటి చైతన్యం ఆలోచనలో ?

# సుధామ

## తీగెలు

ఒకసారి—
రాగాలు చిక్కులుపడి
గళాలు దిక్కులుచెడి
శ్రుతులు మతులు వీడి
ధనులు ఋణుల్లాగా—తీగెలు.
పల్లవీ, చరణాలూ
స్థాయీ, రసాలూ అంటుకోని—తీగెలు.
ఇంకా-అప్పుడే—
ఉనికి చెడ్డసౌకుమార్యాలకు ఉరిగా-తీగెలు.
ఏదో ఎగరేసుకుపోయేదేగలుగా-తీగెలు.
మరోసారి
ఎప్పటికీ అనేకోర్కెలతో
విద్యుత్ప్రసారాలుగా
కొనగోటి మీటలుగా
ఎలదేటి పాటలుగా
కనుగొనల చూపులుగా
మెదడులోని ఆలోచనలుగా
మదిలోని కోర్కెలుగా-తీగెలు.
అందాలు సాగేందుకుగా
పుష్పాలు వికసించేందుకుగా
దారాలుగా, ఆధారాలుగా-తీగెలు
తోడుగా, నెలరేనికిరణాలుగా-తీగెలు
ఊయలగా, ఉనికిగా-తీగెలు

## రవి అస్తమించిన...

కాళ్ళు అడక త్తెరలో
తలపోకచెక్క—
తలపోతల ఉక్క.

నా జుట్టంతా పిన్‌కుష్
ఒక్కో వెంట్రుకా
బలంగా గుచ్చబడ్డ గుండుసూది
పోటు పోటు పోటు
అరికాల్లో గుండె
నరాల్లో గడ్డకట్టిన ఎర్రసిరా.
వర్ణచిత్రాల తల'వి'కారం
మనశ్శాంతిని మసాలాతో వండి
నా ముందే నలుగురూ విందుభోజనం చేశారు.

సరుకు నానుండి పట్టుకుపోయింది
అంతరాత్మలో హోలీనాటి 'బ్బబ్బబ్బా'
నోటిలోంచి వీస్తున్నగాలిమీద
అరచేతి వీపువైపునుండి దెబ్బలు.

పట్టుకున్నట్టే పట్టుకుని
నా కాళ్ళను దగ్గరగా నొక్కుతున్న
పదవివాడులా గారపళ్ళవాడు.

అందుకే-తలభూమియై
దిమ్మగా తిరుగుతోంది.
సూర్యుడెవరనా ప్రశ్న ?
మండుతున్న సమస్య.

వేదన-అరాచకం-అన్యాయం-అవినీతి
కాళ్ళతో నొక్కిపట్టుకొని
సూర్యుడిని జుట్టుతోగుచ్చి తలతోనే మోదు
తలయినా పగలనీ
సూర్యుడు మరణించాలి -
చీకటి వస్తుందంటావా ?
పిచ్చివాడా
ఈ పగలు వున్నదాని కంటేనా ?
చంద్రుడు హృదయం
వాణ్ణి వెలగనీ
సూర్యుడు అస్తమించిన నాటి
పునాదిలోంచి లేవనీ
చంద్రుడున్నప్పుడే కనిపిస్తాయి

ఈ నేలనుంచి ఎగసి వెళ్లిన
త్యాగమూర్తుల రక్తబిందువులు
కోట్ల సామాన్యుల అశ్రుకణాలు
నక్షత్రాలు,

## తిమిర సమీరం

తిమిరం సమీరమైతే
కీచురాయి దానికేక.
మిణుగురు దానివేగం
దివాంధం ఆవేగం.
ఫలం దక్కని కార్మిక స్వేదం
దానితేమ.
ఎగిరివచ్చే చింపిరి విస్తరాకు-
బలాత్కరించబడ్డ రేమ.
ఆ అబల ఆక్రందన దానిసుడి.
పాపం అనేవిహంగం-ఆ సమీరవేళ
కేరింతలతో స్వేచ్ఛగా ఎగురుతుంది
సత్యం కూలిపోతుంది.
అధికార అజగరాల ఆహారం అది.
కనబడకుండా పరుగులెత్తే ఆకాశవునది.
తిమిరం సమీరమైతే
తీతువు దాని నవ్వడి.
కలిదానికి గుడి
గతం దానికి ప్రాకారం
భవితవ్యం కారాదుమరి గోపురం

## గ్లిజరినోద్భూత సంగీతం

గుడ్డివాడు ఏడుస్తాడా-తెలియదు
ఏడ్చిన కారణమేమిటో తెలియదు
పగలు ఏడ్వడం నేనెరుగుదును
అంతా కనిపిస్తోందని,

కలలు కనే అదృష్టంకూడా లేక
ఉసురుసురుమంటూ
ఊపిరి నింపుకుంటున్న వేళ
ఈ వేళ
ఎంత హీనంగావుంది!
ఈ వేళ—
అధికార దర్పంతో
అరాచక శక్తులు విర్రవీగుతున్న వేళ
నీతికి సమాధికడుతూ
నైచ్యానికి శంకుస్థాపన చేస్తున్న వేళ
మేల్కొంటున్న యుగచైతన్యం
మెళ్ళో ఉరిత్రాళ్ళు బిగిస్తున్న వేళ
ఈ వేళ
ఎంత విపరీతంగా వుంది!

*

## నగరంలో అర్ధరాత్రి

అర్ధరాత్రి
అలిసి సొలసి నిద్రిస్తున్న నగరం
దినమల్లా విరామంలేక
విశ్రాంతి తీసుకుంటున్న రోడ్లు
రోడ్ల ప్రక్కనే
పేవ్‌మెంట్లపై మూగజీవాలు—
దైన్యమనే దుప్పటిని కప్పుకొని
విషాదానికి ప్రతినిధులుగా
నిద్రిస్తున్న మానవులు—
ఎముకలు కొరికే చలితో
కొట్లాడి గెల్చినవాళ్ళు
అక్కడ—
ఎత్తైన భవనంలో
అందాన్ని కొనుక్కుంటున్న మనిషి.

బార్‌లో ఒళ్ళు వేడిచేసుకుంటున్నవాడు-
క్లబ్బులో-ప్రియురాలి కౌగిట్లో
అచ్చుతప్పుల్ని దిద్దుకుంటున్న నాగరికుడు-
ఆ క్షణం—
బ్రిడ్జిప్రక్కన గుడిసెల్లో
ఒక్కసారే ఏడ్పులు-
ఎవరిదో
విషాద జీవయాత్ర ముగిసినట్టుంది.
వెలుతురుకోసం పోరాడిపోరాడి
వెలుగును చూడకుండానే
కన్నుమూశాడు.
ఆ వేళ—
ఆకాశంనుండి
చుక్క రాలిపోలేదు
ఏడుస్తున్నవాళ్ల
కన్నీటిచుక్కలు తప్ప.

*

## ఛితి

నేస్తం!
ఈవేళ ఏమని జాబువ్రాయను
ఏమి జవాబువ్రాయను
జాలి, కనికరంలేని
విధి విసరిన ప్రతిరాయీ నాకే తగులుతున్నది.
ప్రభుత్వం చేసిన
ప్రతి శాసనం నన్నే బలికోరుతున్నది
తనివితీరా త్రాగడానికి కన్నీళ్ళుకూడాలేవు.
మనం గుండెల్ని ఆరవేసినవాళ్ళం

నవ్వుతూ రేపువస్తుందని
మవ్వూ-నేనూ-అనుకున్న వాళ్ళం
మరి ఈ విపరీతమేమిటి ?
మల్లెపొదలవంటి బ్రతుకుల్లో
ఇన్ని విష సర్పాలెందుకు ?
ఇన్ని విపత్తులెందుకు ?

## 2

ఆశయాలు ఉరిపోసుకున్నవి
ఆదర్శాల చితి
అందంగా భగభగా మండుతున్నది
మంటల్లో 'రేపు' కాలిపోతున్నది
చల్లని గాలి వేడెక్కింది
పిచ్చెక్కిన సంఘం గురిచూసి కొట్టినదెబ్బకు
వెచ్చని రుధిరం కారుతున్నది.
కారుతున్న రక్తంలో
ఎన్నో అమాయకపు బ్రతుకులు
దీనంగా కన్పిస్తున్నవి
నగ్నమైన మానవాకారాలు
నాకుతెలియని సత్యాలు చెబుతున్నవి....
నాకేవో కొత్తలోకాలను చూపుతున్నవి.... *

* * *

## ఎ. బి. లక్ష్మి

### చెప్పగలవా ?

అపురూపమైన—భగవంతుని సృష్టిలో
మంచికంటె చెడు,
ప్రేమకంటె ద్వేషం,
అనురాగం కంటె అసూయ,
స్నేహభావాన్ని మించిన ఈర్ష్య,
ఎందుకుంటాయో—చెప్పగలవా ?
ఆపేక్ష ఖరీదు—ఆరుపైసలైతే
అంగట్లో కొనుక్కోవచ్చు—
కానీ అంతఃకరణలోగాని
అది దొరకదంటే
అంతఃకరణేలేనిచోట
అదెలా సాధ్యమో—చెప్పగలవా ?
నవ్వుల పంటలా—వెన్నెలజల్లులా—
పాలవెల్లిలా—బ్రతకాలనుకుంటే—
ఆశించినవి అందక,
అల్లంత దూరంలో నిలబడి
మన నిస్సహాయతని—వేలెత్తి చూపిస్తూ,
వెక్కిరిస్తాయి—ఎందుకో—చెప్పగలవా ?
గుర్తుంచుకునేందుకు
ఏమీ మిగల్చని గతం—
భయంతప్ప మరేదీ—జ్ఞప్తికి తేలేని భవిష్యత్తు—
ఏమీ సాధించలేనన్న నిరాశతో
ఏదో సాధించాలన్న తపనతో—
మనసంటే ఏమిటో ;
తెలీని మనుషులమధ్య
మమతంటే అర్థంగాని
మనస్తత్వాల మధ్య
అంతూ దరీ లేని
అగాధంలాంటి బ్రతుకులో

ఆత్మవంచన లేకుండా
జీవించడ మెలాగో_చెప్పగలవా ?
తానుండే అరణ్యం తప్ప
మరో ప్రపంచం తెలీని అనాగరికతకు_
మేధస్సుతో నిండి_పరిపూర్ణమైన
ఆలోచనలకు ఆలవాలమై
చిక్కు ప్రశ్నలా మిగిలిపోయిన_నాగరికతకు
తేడా ఏమిటో_చెప్పగలవా ?
'ఊహలు'_'మాటలు'_
'చేతలు'_'జీవితం'_
ఏ ఒక్కదానికీ సరియైన
పొంతన కుదరని నాడు,
వాటికి_అవే_అర్థాలు చెప్పుకోలేనినాడు,
ఉనికేలేని వాడికి_
ఉన్నతికోసం తాపత్రయమెందుకో_చెప్పగలవా ?
మనిషికి_మనిషెందుకు
దూరవౌతాడో !
మనసుతో_మనసెందుకు.
కలసిపోతుందో !
ఇంతపొడవైన కాలంలో
కొన్నిక్షణాలకి మాత్రమే,
ఎందుకంత విలువో !
ఎన్నో అనుభవాల్లో_
ఏ కొన్నో మాత్రమే,
ఎందుకలా మరపురాకుండా
గుర్తుండిపోతాయో_చెప్పగలవా ?
జిలుగు మెరపుల తళుకుల్తో
మెరసిపోయే జలతారు తెరవెనుక_
అంతా గాఢాంధకారమేనని_
తెరవెనక్కి తొంగిచూసి,
చీకటిని తరిమే
చిరు దీపాన్ని_వెలిగించాలనే ఊహ
ఏ ఒక్కనికో మాత్రమే
స్వంతమెందుకో_చెప్పగలవా ?

*

## ఏమంటావు నువ్వు ?

అలల కడలిమీద నడయాడే
నావ వంటిది జీవితం–
ఏక్షణాన ఏం జరుగుతుందో ;
ఏ గమ్యం చేరుతుందో,
అంతా అగమ్య మంటే–ఏమంటావునువ్వు ?

ఆప్యాయంగా, ఆపేక్షగా,
ఆదరంగా మాట్లాడితే–
పసివాళ్ళు మనచుట్టూ, మనసులచుట్టూ
అల్లుకు పోతారంటే–నువ్వేమంటావ్ ?

ఆడిపాడాల్సిన వయసులో
ఎదురుదెబ్బలు తగిలితే–
కొండెక్కిన కోరికలకోసం
అవన్నీ భరించాలంటే,
కొన్నిరోజులు ఓపికపట్టాలంటే–ఏమంటావు నువ్వు ?

కల్లుతాగిన కోతిలాంటిది
స్థిరనిశ్చయంలేని
మనిషి మనసు –
తనకి రాబోయే ప్రమాదాన్ని
గుర్తించలేని స్థితి,
తన ఉనికినే మరచిపోయే పరిస్థితి,
కల్పిస్తుందంటే–నువ్వేమంటావ్ ?

సూత్రం పట్టుకున్న చేతిలో
పట్టు–నేర్పులేక పోతే–
గాలిలోకి ఎగరేసిన గాలిపటం
గాలివాటుకే తిరుగుతుందంటే–ఏమంటావు నువ్వు ?

ఎంతటి విజ్ఞాన వంతుడయినా,
మనిషి మనస్తత్వాన్ని ఎప్పటికీ
అర్థం చేసుకోలేడని తెలిసినా–
మనిషి–మనిషికి పూర్తిగా
అర్థం కావడం కూడా
అంత మంచిది కాదంటే–నువ్వేమంటావ్ ?

అతిశయించిన—అభిమానం,
శ్రుతిమించిన—సానుభూతి,
హద్దుదాటిన—అనురాగం
ఆవేశపూరితమైన—ఆదరణ
ఆనకట్టలెరుగని ఆప్యాయతలను,
తట్టుకోవడం—
కష్టమంటే—ఏమంటావునువ్వు ?

మనసుల్ని మకిలి చేసుకుని,
మమతల్ని మడత పెట్టి,
హృదయపు ముడుతల్లో దాచేసి
ఏభావమూలేని ముఖంలో
వచ్చీరాని నవ్వుకి—దయాదాక్షిణ్యాల
వెండిపూత పూసి
మనసులోని భావాలకి—పెదవులమీది మాటలకి,
'లింకు'లేని డొంక తిరుగుడు
మాటలు మాట్లాడేవాడు,
మామూలు మనిషి కాదంటే—నువ్వేమంటావ్ ?

బరువూ బాధ్యతలకీ
భావనా ప్రపంచంలో—తావు లేదంటే—
పొందికైన భాషలో
అందంగా పొదిగిన చక్కని భావాలతో,
కూర్చిన ముత్యాల కోవలా—
అలసిన మనసును సేదటీరుస్తున్నట్లు,
ఆ అనునయానికి—కనులు చెమ్మగిల్లేటట్లు
అక్షరాలు కూడా—అనురాగామృతాన్ని
వర్షించగలవంటే—ఏమంటావునువ్వు ?

* * *

# వి. వి. సత్యప్రసాద్

## చిన్న మనవి

ఎదలోపల ఆవేశం
ఒక్కసారి పెరుగుతుంది....
మనుషులపై తెలియరాని
కసిఏదో రేగుతుంది....
నాకీ మానవలోకంలో
కొందరు మనుష్యులను
వారి పాతకముల జూసి
ఖండించాలని వున్నది!

*　　*　　*

నాలోపల ఆవేశం
ఈ విధముగ పొంగినపుడు
ఒక్కక్షణం సొంతంగా
కూర్చుని ఆలోచించా!....
ఆవేశంలో మనిషికి
విజ్ఞానం లోపించును....
పైశాచిక వృత్తి ప్రబలి
అజ్ఞానం వ్యాపించును....
మంచీచెడు రెండూ కలసి
విహరించును లోకంలో-
మంచికి మబ్బులు పట్టెను-
చెడుకి ఆదరణపుట్టెను....
మనిషి మనిషినే చంపే
రాక్షసత్వమతిశయించు
విద్వేషం పెరుగుతోంది-
విధ్వంసం జరుగుతోంది!
మానవతను మంటగలుపు
ద్వేషానికి హేతువేమి?
మానవతా ప్రవృత్తిలో
స్పర్థల కవకాశమేమి?

మనుషుల మధ్యను ప్రబలే
అంతరాల దురన్యాయ
మంతటికీ ఒకే ఒక్క
కారణాన్ని ఊహించా —

అన్యాయపు టార్జనతో
బాగుపడే ధనవంతులు
బ్రతుకలేక బ్రతుకుతున్న
చెమటోడ్చే పేదవాళ్ళు —

రాజకీయవలయంలో
చిలువలు పలువలుగా ఈ
అంతరాలు విస్తృతమై
జాతిని కలుషితముచేసె....

ఒకరిపైన ఒకరికి కసి....
కసిరేపే అజ్ఞానం....
అజ్ఞానం, ఆవేశం
మనిషి ఎదకు మాయని మసి!

పాపం చెయ్యని దెవ్వడు?
నే చేస్తే పోయిందేం?
— ప్రతిమనిషీ నేర్చుకున్న
సంకుచితపు భావన ఇది!
కలియుగమిది పాపానికి
మలి యుగమని ప్రతివాడూ
తప్పుడు వేదాంతమ్మును
అలవరింప నేర్చినాడు....

సౌభ్రాత్రం, మంచితనం
రాజకీయముగ మారెను —

విజ్ఞానం పనికిరాక
ఆకటిచిచ్చులు రేపెను....

ప్రపంచమున ఎటుచూసిన
సమస్యలేగద ఇప్పుడు!
సుఖశాంతులు లోపించే
గడ్డుపరిస్థితులు నేడు!! —

ఎట్టి పరిస్థితులనైన
ధర్మబద్ధమైన దృష్టి :
సత్యమార్గమగు నడవడి
ఉన్నప్పుడె మనిషియొక్క
వ్యక్తిత్వము రాణించును....
పేదవాడి నంటూనే
ధనవంతుని ద్వేషించను....
ధనవంతుడనంటూనే
పేదవాణ్ణి హింసించను.
ఉన్నవాణ్ణి ద్వేషించిన
నా కొదిగే ఫలితమేమి ?
లేదంటూ అంగలార్చి
వీధినపడి లాభమేమి ?
అక్రమ మన్యాయం ఈ
లోకం మోసం అంటూ
దిగంబరుణ్ణై చిందులు
త్రొక్కిన ఫలితం ఏమిటి ?
లోకంపై ద్వేషమ్మును
పెంచుట అభిమతముకాదు....
మనుష్యులను మనుష్యులుగ
చూసినపుడె మనిషి నేను !
దుర్మార్గుల నందరినీ
వీధుల్లో చంపాలని
శుష్క కవిత లేవొరాసి
కసిని తీర్చుకోజాలను !
దుర్మార్గులు, విద్రోహులు
ధూర్తులు ఈ లోకంలో
సంచరించి మానవతను
మంటగలుపుతున్నప్పుడు
ప్రతిమనిషీ ఒకగాంధీ,
ఒక బుద్ధుడు, వివేకునిగ
మానవతా సమైక్యతను
సంఘటింప చేయగలుగు

నిర్మాణాత్మకమగు కృషి
చేయాలని నాకున్నది...
చిన్నవాణ్ణి. అంతశక్తి
లేనివాణ్ణి, కావున ఒక
చిన్న మనవిమాత్రం నే
లోకానికి చేస్తున్నా..
స్వార్థానికి, ఆశలకూ
బానిసగా కాకుండా
మదమాత్సర్యములు వీడి
మనుషులు జీవించాలని,....
సంపదల ప్రలోభాల
మత్తులోన సంచరించు
ఉన్మత్తత మారాలని,
సంకుచితం పోవాలని;
మల్లెకన్న, హిమాద్రిపై
మంచుకన్న నిర్మలమగు
మంచిని మనసున నిలుపుట
ప్రతి మనిషీ నేర్వాలని,....
సహజీవన సామరస్య
సమభావం, సహకారం
చేతలలో చూపగలుగు
నైజం పెంపొందాలని,....
మంచి ఊహలే ఎపుడూ
మెదడున నర్తించాలని
భగవంతుని సంపద, మన
ఎదలోపలనే ఉందని;
ఉత్సాహము, సాహసమూ
బుద్ధిశక్తి పరాక్రమం
మనమనసుకు నేత్రావులు....
భగవంతునకవినెలవులు....
మనిషి ఊహ విశాలమై
మనిషిమెదడు విస్తృతమై
చేతలు దృష్టాంతములై
ఉండాలని నాదు మనవి ::

*

# విశ్వనాథ సూర్యనారాయణ

## ఆగండి !

ఆగండి !
అక్కడే ఆగండి !
శిశువుల శిరస్సులనూ
నెత్తుటి సరస్సులనూ
దాటిపోయేముందు ఆగండి!
ఒరిగిన కన్నీటి జడులలో తడిసి
పెరిగిన కష్టాల మళ్ళలో నడిచే
కరువు జనాలను కాదనకండి
ఉడికే రక్తాన్ని
ఊరమ్మట చూద్దామనుకోకండి
సంతోషంగా వుండే తల్లుల్ని
సమాధిమీద పూలను చేయకండి
పసివాడని బాలురపై
కసితీర్చుకో ప్రయత్నించకండి !
'హ్యూమానిటీ'ని ఊహించకండి, చూడండి !
ప్రజలను శత్రువుగా చేసుకోకండి
ప్రపంచం తిరగబడగలదు
ప్రజాస్వామ్యమని చెప్పి
ప్రజలకు స్వాములు కాకండి !
ఎటు ప్రక్క తిరిగినా మీ ముఖం మీకగుపించదు
ప్రజల అద్దంలో ప్రతిబింబం
పరిపూర్ణంగా చూసుకోండి
ప్రజలు సూర్యుడైతే మీరు భూమి
ప్రజలు గిన్నెైతే మీరు ద్రవపదార్థం
ప్రజ లాకర్షణ శక్తయితే మీరు వస్తువు
ప్రజల్నుండి పారిపోడానికి
ప్రయత్నం చేయకండి !
శూన్యంలోకో, శ్మశానంలోకో పోతారు
అధికారం, దర్పం అడుగంటిపోయి

మసుగడవోయి మసైపోతారు
అందుకే ఆగండి!
అడుగు వేసేముందు
అరక్షణం ఆలోచించండి!

## ఆనందం నీ జన్మహక్కు

నీ ఆలోచనలను మండనీ
నీ ఆవేదనను అరవనీ
అప్పుడుగాని నీ మూర్తి నీకు తెలియదు
నీ స్ఫూర్తి బయటపడదు
మండే ఆలోచనలలోంచి
అరిచే ఆవేదనలోంచి
ఆవేశాన్నుప్పొంగనీ
కొలిమిలో పెట్టిన గుండెను
కొన్నాళ్ళైనా కాలనీ
ఎండిపోయిన కళ్ళను
కన్నీళ్ళలో ఈదనీ
కాలం కలిసిరాదని చెప్పే
కాలరాచేవాళ్ళ మాట వినకు
మృత్యువుకోసం తపస్సుచేసే
ముసలి హృదయాలతో కలియకు
ఆనందాన్ని అదృష్టంగా భావించి
అనుభవించే జనాన్ని
గురిచూసి కొట్టు
గుండె లదరగొట్టు
ఆనందం నీ జన్మహక్కు
అణచే అధికారం దేవుడికిసైతం లేదు.

## ఆకలి గ్రైడు

ఆకలి ప్రశ్నలన్నిటికీ
అద్భుతమైన గ్రైడు
మందభాగ్యులందరికీ
మాస్టర్ గ్రైడు

తాజా సరుకు, మజా చూడు
ఆకలి ఉన్నవాళ్ళందరూ
అవశ్యం కొనవలసిన గైడు
పది రోజుల్నుంచీ వస్తున్నవాళ్ళకి
పాతికశాతం డిస్కౌంటు!
అధికారంలోని బుర్రలన్నీ
పదేపదే ఆలోచించి
ఆలోచనలన్నీ రసాయనంచేసి
కరిగించి, మరిగించి
అక్షరాలు చేసి, అచ్చుపోసి
అమ్ముతున్నారీ గైడును
ఆకలి వాళ్ళల్లారా! అందుకోండి
అప్పైనాచేసి కొనండి
ఆకలంటే తెలుసుకోండి
అమృతంలాంటి గైడును
అనవరతం తలవండి
ఆకలి కతీతంగా వుండండి
ఆకలయినప్పుడల్లా ఆ
పవిత్ర గ్రంథ పారాయణం చేయడం
ఆకలిని మరిచిపోయి
ఆనందంగా గడపండి
దొరతనంవారి దోవకు అడ్డంరాకండి. *

## శ్రుతిరేఖలు

హలో!
యస్! హలో!
తీగెలు పలుకరిస్తున్నాయి
లతాంతాలనూ, పల్లవాలనూ కౌగలించుకొని
లాస్యం చేస్తూ నవ్వుతున్నాయి లతలు
రకరకాల రసహృదయాల్లాంటి
జంత్రవాద్యాలనుండి
సరిగమలతో తీగెలు పాడుతున్నాయి
రంగురంగుల గోళాలలో
తీగెలు వెలుగును పలుకుతున్నాయి

తీయగా సాగే మధురాలాపన కంఠస్వరంలో
తీగలు కదుల్తున్నాయి
అభోజనంగా వుంటున్నవాడి కడుపులో
పేగుల తీగెలు తెగిన వీణలా
తెగమోగుతున్నాయి
ఉదయభాస్కరుని లేతకిరణాలు
ఉషస్సుని ఆశీర్వదిస్తున్నాయి
నభోభాగంలో మెరుపుతీగెలు
జవరాండ్రై భూమిని చరిస్తున్నాయి. *

## ఓహో! బంగారు దేశమా!

సాయంత్రం —
వార్విక్ షైర్‌లో షైర్లుకొడుతూ
నెదర్‌లాండ్స్‌లో ఐస్‌రోడ్డుమీద
మెత్తగా జారుతూ
పూరేకులు తింటున్నాను
నయాగరాలోని
వయారాలను చూస్తూ
నైలుజాలులో తేలుతూ
రోములో తూల్తున్నాను
ముదురునీల మేఘాల్లోంచి — ముందుకురుకుతూ
నేలమీద ప్రకృతి పరచిన
పచ్చని పచ్చడాలమీద వాలాను
కేప్ కెనడీ దగ్గర — సముద్రాన్ని సందర్శిస్తుంటే
హిమాలయాల్లోని
గౌరీశంకర శిఖరం పిలిచినట్లయింది
కడలిని దాటుకుంటూ కదిలివచ్చాను హిందూదేశానికి
కలల్లోకైనా ఎవ్వరూ రానివ్వలేదు
వాళ్ళ జీవితాలకీ, కలలకీ కావల్సినంతగా
ఆకలీ, అనాదరణా అన్నీవున్నాయట!
అసంతృప్తి గాలులకు ఊపిరాడక
అన్యదేశంవైపు సాగిపోయాను—

# అల్లంరాజు రాధాకుమార్

## హృదయవీణకు...

మెదిలే భావాలకు మదిలో తోడుగా ;
రాగాలను సృష్టించేందుకు
భావాలకు స్పందనగా ;
నా హృదయవీణకు తీగెలు.
విషాదంలో సైతం
రసకుసుమం వికసించేలా
అనుభూతుల పరిమళాలు
అనవరతం నిలిచేలా
నా హృదయవీణకు తీగెలు.
ప్రాణానికి ప్రాణంగా
జీవనవాద్యంగా, హృద్యంగా
నా వీణకు తీగెలు.
తీగెలపై వ్రేళ్ళకు బదులు
కాళ్ళు పెట్టవద్దునువ్వు.
వాద్యం నేనవుతే
వాయించే వాణివి నువ్వు కా.
నీ వ్రేళ్ళే సున్నితం అనుకోకు
నా తీగెలూ సున్నితమే.
రెండూ మౌనంగా కలవనీ
రస సృష్టి జరుగుతుంది.
స్వరాలు ఏకం చేద్దాం.
యుగయుగాలు
జగాల లోతులు చూద్దాం.

## పిలిచే ఆలోచన

గతాన్ని గుర్తుకుతెస్తూ—
ఉనికిని ఉసిగొల్పుతూ—
నగ్నసత్యాల గుర్తులను
నిరంతరం నాట్యమాడిస్తూ—

ఆలోచన.
పెదడు మనిషిలో
అనాదిగా_పునాదిగా___
తోడుగా_నీడగా___.
ఆలోచన.
మనస్సును పిలుస్తూ
మనిషిని నిలవేస్తూ
ప్రతిదానికి, ప్రతిసారీ
పలుతెరగుల_ఆలోచన.
అవునామరి :
అయినా అది సొలెగూడు
అందుకే___
కలలెన్నో వలలుగా
ఆశలు దారాలుగా_అల్లి ;
తానొక కీలకంగా
తననొక కీటకంగా
మలచేదది_పిలిచేదది_సదానిలిచేదది
అది_ఆలోచన.

## నిజం నిద్రపోతోంది

చీకటి బజారు వెలుగుల్లో
వెలుగు చొరని చీకట్లో
గతంలోని గాథల్లో
చిక్కుపడ్డ బందీగా
నిజం నిద్రపోతోంది.
నివురు గప్పిన నిప్పులా
దిక్కు తప్పిన పక్షిలా
మట్టిలోని మాణిక్యంలా
నీళ్ళలో పాలల్లా
నిజం నిద్రపోతోంది.
అసత్యాన్ని అసహ్యించుకుని
సహనంతో సమయానికై
ఎదురుచూస్తూ

నిజం నిద్రపోతోంది.
పలయావారు
ఇచట సంప్రదించండి
ఇక్కడ నేనుంటున్నా.

## ఓటు

ఓటు—
ఇది ప్రజాస్వామ్య యానానికి బోటు
ఉపయోగించుకో లేకుంటే నీదే లోటు
నీ మనో దౌర్బల్యానికి ఇవ్వక చోటు
నాయకులు ఎరచూపేది—నోటు
అందుకోకు—అది నీ వ్యక్తిత్వానికే వెన్నుపోటు
గతాన్ని గమనించి
భవిష్యత్తును బంగారు పాటగా పలికించే
ప్రజాస్వామ్య వల్లకిని సరిగా మీటు
పదిమందినీ నడిపించు,
సరైన బాటలో నీతోపాటు.
అప్పుడే
సఫలమై, నిజమైన విలువనందుకుంటుంది
నీ ఓటు. *

## అలజడి

మనసులేని మనిషికి
మమతలేని మనసుకు
నిరంతరం అంతరంగంలో ;
సమస్యలను పరిష్కరించలేని వాడికీ
సృష్టించేవాడికీ మధ్య
తాండవ గతుల్లో ;
కడుపునిండని కార్మికుడికీ,
కడుపు నిండిన కలవాడికీ ;
అలజడి.
సుఖానికి, దుఃఖానికి
మంచికి, మారణహోమానికి

జననానికి, మరణానికి
నిరంతర సంఘర్షణ—
అలజడి.

*

# ట్రయాంగిల్

కాళ్ళు నోరెట్టుకుని గట్టిగా అరిచాయి
పాదరక్ష హడలిపోయి రోడ్డుకి సలాం చేసింది
సలాం చేసినందుకు సానుభూతైనా లేక
పాదరక్షని త్రిప్పి కాళ్ళకేసి కొట్టింది రోడ్డు
కాళ్ళకి కోపం వచ్చింది.
కాళ్ళకీ, రోడ్డుకీ మధ్య చెప్పు నలిగిపోతోంది.
కుక్కిన పేనల్లే కాళ్ళు నోరు మూసుకున్నా
మూలగడం మానలేదు దీర్ఘరోగిలా.
రక్షణ లేకుండా పోతుందేమో నన్న భయంతో
పాదరక్ష రోడ్డుని శరణు కోరింది
అభయహస్తం పుచ్చుకున్నాక,
చెప్పు కాళ్ళక్రింద నలగడానికి సమ్మతించింది
అయితే ఒక షరతు పెట్టింది—
'మీ యిద్దరిమధ్యా నన్ను రాస్తున్న కారణం ఏమిటో' చెప్పమని.
ఎవరూ ఏమీ ప్రత్యేకంగా చెప్పలేదు గానీ
తటాలున చెప్పుకే తెలిసివచ్చింది—
'ఎంతదూరం ఇంకా ఇలా నువ్వు'
అని రోడ్డుని కాళ్ళు,
'ఎంతకాలం ఇంకా ఇలానువ్వు'
అని కాళ్ళని రోడ్డు,
పరస్పరం కోపగించుకోడానికి
తనను సాధనం చేసుకున్నాయని.
ఇది దీర్ఘకాలికం అని తెలుసుకుని
చెప్పు గొంతు తెగేలా నవ్వింది.
కాళ్ళు, రోడ్డు—చెప్పుని దూరంచేసి
కలవక తప్పలేదు.
ఆ కాళ్ళు నిరుద్యోగివి.
ఆ రోడ్డు ఇంటర్వ్యూల వైపు.

## ఎమ్. రత్నమాల

### గ్రహణం - గమనం

నవభారత శ్వేత పద్మరథం
యువభారత కురంగ యూథం
అస్తవ్యస్తంగా, అధ్వాన్నంగా తయారైన
నేటి రాజకీయ రాహువునోట్లో
అస్తమించలేక అవస్థపడుతోన్న
సూర్యుడు నేటిదేశం.
అదిగో అటుచూడు
చీకటి కడుపు చీల్చుకొని
రక్తంత్రాగి రోషం క్రక్కుతూ
విడివిడిగా
కాదు వడివడిగా
లాక్కొస్తున్నాయి రథాన్ని
రాహువు నోట్లోంచి
చీకటి కొట్లోంచి
ఆరని చిచ్చులోంచి
ఎక్కడికి పోతోంది రథం
ఎటు పోతోంది తరం
సమతాద్వీపంవైపు
నవతాలోకం వైపు
ఆశలతీరంవైపు
కాని అందులో ఒకటి
నక్షత్రాలని నమిలిమ్రింగి
చీకటిని తనివితీరాత్రాగి
వెలుగును వెదజల్లలేక
విజయంపై విశ్వాసం సడలి
వ్యామోహం పెరిగి
సెక్సులో ఫిక్సయిపోతోంది
సక్సెస్ సాధించలేకపోతోంది
రాహువు బాహువుల్లో రమిస్తోంది
అంటుకే దేశం శపిస్తోంది.

మరొకటి
ఇజాల్లోని నిజాలకి
మసిబూసి మారేడుకాయజేసి
ఖజానాలని నింపుకునే
పెద్దలకి గుణపాఠం చెప్పలేక
కల్లోలాలతో కాలం వెళ్ళదియ్యలేక
తాతలనాటి గతం బాగుంది,
వెనక్కి వెళతానంటోంది
కానీ, గతం తలుపులు తెరుచుకోవని
జ్ఞాపకాల గురుతులుతప్ప
కాలం వెనక్కురాదని
పాపం ! తెలియదుదానికి.
కొన్ని వెనక్కు, కొన్ని ముందుకూ లాగుతూవుంటే
చావుపుట్టుకలమధ్య
సమస్యాతోరణంలా
ఊగుతోన్న రథాన్నిచూచి
మరొకటి,
వాస్తవాన్ని అర్థంచేసుకోలేక
భ్రమలో బ్రతకలేక
వర్తమానంలో వందేమాతరం పాడలేక
తనకుతానే అర్థంకాక
అలజడి చేస్తోంది, ఆవేశం చెందుతోంది
రణరంగం కావాలని రంకెలువేస్తోంది.
ఏది ఏమైనా,ఆరునూరైనా
క్షణకాలం కాలం ఆగదు
తరంగాలు తీరంతో పోరటం మానవు
మార్పుకోసం పోరాటం ఎప్పుడు
మంచికోసం ఆరాటం తప్పదు
రథం సాగింది
తూర్పు రాగరంజితమయింది
బ్రతుకుపై రక్తినిపెంచుకొని
గతం చేసిన గాయాల్ని
వర్తమానం చెప్పినపాఠాల్ని

గీతాల్లా పాడుకుంటూ
విశ్వాసంతో, వివేకంతో
విజయంవైపు సాగిపోతోంది
నేటి యువత. *

## కాలాన్ని కన్నీటితో కొలవకు

కాలాన్ని కన్నీటితో కొలవకు
కర్తవ్య నిర్వహణలో కడగండ్లకు వెరవకు
బాధపడితే మిగిలేది
చివరకు బాధమాత్రమే
అందుకే_కాలాన్ని కన్నీటితో కొలువకు
కర్తవ్యనిర్వహణలో కడగండ్లకు వెరవకు
గోరంతబాధను కొండంత చేసుకొని
భవిష్యత్తును భయంకరంగా మార్చుకోకు
కాలం నీకిచ్చిన కషాయాన్ని
ఔషధంలా అనుభవిస్తే
ఔన్నత్య శిఖరాలను అందుకోగలవు
కష్టంలేనికాలం కఠిన పరీక్ష.
ఎదురీదగల చేవ ఉంటేనే
కార్యసిద్ధి పొందగలవు
కమనీయ భవిష్యత్తును కాంచగలవు
కాలికి ముల్లు గుచ్చుకున్ననాడే
కన్నీరు కారుస్తారు కొందరు
కాలం కాటువేసినా
కడసారి చిరునవ్వు వీడరు కొందరు
ఏది ఏమయినా చివరకు మిగిలేది
అనుభూతి మాత్రమే
అందుకే కాలాన్ని కన్నీటితో కొలవకు. *

## ఆనందజ్యోతి

కష్టాల్ని కళ్ళలో కరిగించుకొని
కన్నీళ్ళతో నన్నభిషేకించిన

అమ్మ ఒడిలో తొలిసారిగా కళ్ళు తెరిచినపుడు
ఆత్మ విశ్వాసాన్నిచ్చి, ఆశీస్సులు కురిపించి
ఆదరించవలసిన అమ్మ చూపుల్లోని
ఆవేదనని, అసహాయతని అర్థం చేసుకున్నప్పుడు
ఆవేశం తప్ప అవగాహనలేక
నాలో పెరిగిన కసిలో
నేనే మసియై, నుసియై
గాలి ఎటువీస్తే అటు
గమ్యం లేకుండా కొట్టుకు పోతున్నప్పుడు
"ఆగు! ఆలోచించి సాగు!" అని
ఆదేశించిన అనూహ్య, అజ్ఞాతశక్తి
నేడన్నది నిష్ప్రయోజనంగా
రేపన్నది రాక్షసిలా
నిన్నటిమాటే తలచరానిదైనపుడు
ఏమీ చెయ్యలేని అశక్తతతో
హృదయం బండబారి
మొండిగా ఎదురుతిరిగి
పైశాచికతకు పునాది వేస్తున్న క్షణంలో
నాలో పరివర్తన కలిగించి
ఆవేదన అట్టడుగున
అంతర్గతంగా అణగియున్న
ఆత్మకి ఆరోగ్యాన్ని ప్రసాదించి
కష్టాలకి, కన్నీళ్ళకి-కరగని, చెరగని
చిరునవ్వు దివ్వెని అందించిన
నువ్వు
విధివో
మరే అజ్ఞాత జ్యోతివో
ఆత్మవో, పరమాత్మవో
నిర్వచించే శక్తి లేదు నాకు
ఐనా నాలో చివరి బిందువు
ఆవిరై పోయేవరకూ
ఆరిపోకుండా వెలిగే
ఆనంద జ్యోతివి. *

* * *

# మాడభూషి రంగాచార్యులు

## అసంతృప్తిని ఆహ్వానిస్తాను !

వెలుగునకు ఆవలివైపుననున్న
అన్ని మధురోహలూ
అంధకారమయ జీవితానికి
ఇవ్వబడని వరాలు !
చీకటీ, అసంతృప్తి నిరాశా నిస్పృహల్లో
విరజిమ్మిన కనుసన్నల్లోని కన్నీరూ
అన్నీ నాకు వరాలే ! !
వెలుగులో చూడలేనివి కొన్ని
చీకటిలో తడుముకుంటైనా
వెతుక్కోగలం.
చీకటి విలువే
వెలుగును వెతుక్కోమంటుంది.
వెలుగునకు నిర్వచనం
చీకటంటే తెలుస్తేనేతప్ప తెలియదుకనక !
మనిషిలో సంతృప్తి
చేతస్సుకు సజీవ సమాధికడుతుంది
కోరికలీడేరితే
జీవించడంలో సజావైన మజాలేదు
వరించిన జలధరంపగిది
చెదిరిపోతుంది జీవిత పరిధి.
దొరికీ దొరకని సంపదలు
కలిగీ కలగని సాక్షాత్కారం
మిగిలీ మిగలని సంతృప్తి
మనిషి మనుగడ కడలిలో
కోరికల మంథరంతో
మథించగా పుట్టిన
మణులు, మాణిక్యాలు
కౌస్తుభాలు, ఉచ్చైశ్రవాలు
హే భగవాన్ !

గమ్యహీనమైన, పథవిహీనమైన
ఈ నిస్సారజీవితం ఇలాగే సాగనీ
ఈడేరని కోరికల
అసంతృప్తుల పైను విభావరులు వెదజల్లే
ఆర్ద్రమైన కాటుకను
రెప్పలమాటున చిప్పిల్లే
శత విద్యుత్కాంతి పుంజాల్లోనే
అసంతృప్తినాహ్వానిస్తాను
అందులోనే
సంతృప్తినన్వేషిస్తాను. *

## తస్మాత్ జాగ్రత !

ఓయీ విద్యార్థీ !
చరిత్ర చర్విత చర్వణమౌతున్నది !
రాజకీయ కుతంత్రాల సవనంలో
స్వార్థం-నిస్వార్థాల రాపిళ్ళ బుట్టిన
అగ్నికి ఆజ్యానివి కావద్దు.
శలభానివి కావద్దు-కాకారాయుడివి కావద్దు !!
నీ ఆయువుల హవిస్సులు
పైనుండే దేవతలకు చేరగా
ఈ యజ్ఞగుండాల్లో మిగిలేదీ,
నీకు దక్కేది- బూడిదేనని తెలుసుకో !
ఇదంతా పిడివాదయుగం
ఎవరినెంతవరకు పిడికిట్లోంచి జారకుండా
వాడుకోవాలో బాగా తెలిసినయుగం
కుక్కగొడుగుల్లాంటి
ఉద్యమాల వెల్లువల్లో-రెల్లుగడ్డివై కొట్టుకుపోకు !
ఇటీవలి అలజడుల్లో-మిగిలింది నీకెంత
తగిలిందేకాని !
ఎడ్డిరాజ్యపు బావుటాక్రింద
గడ్డి కరిచావుకదా !-నీవు బావుకుందేముందని !
ఎమ్ముల విరగ్గా-నెన్నుదుటిపై కట్టినబొప్పి మాననేలేదు
తెలిసి ఎదురుదెబ్బలు ఎందుకు తింటావు ?
చరిత్ర చర్విత చర్వణమౌతుంది !!

ఏలినవాడెవడైనా-గేలి చేసిందినిన్నే
మరి లోకం !!
నీకేం ఒరిగింది- నీకేం అమిరింది
కాపీలుకొట్టి సంపాదించిన
కానీకి పనికిరాని తద్దీకు చేసిన సనయదప్ప!
ఈ పట్టాలు పనికిరావని కొందరు
బాహాటంగా ప్రకటిస్తే
ఎవరైనా ఈ రాజకీయ కుతంత్రజ్ఞులు
నోళ్ళు మెదిపారా-నీవెంట వచ్చారా!
ఇది ఉద్యమాల యుగం !! కాదనను !!
వాటి ఫలితాలుమాత్రం
పెద్దలకు పెట్టిన
తద్దినాలవంటివే మరి.
ఎన్నో సల్తనత్తులు-తఖత్తులు డిగ్గి
బుగ్గైపోయాయి- అందుకే అంటున్నాను
చరిత్ర చర్విత చర్వణమౌతుందని
నీ భవితవ్యాన్ని పణంగా పెట్టి
నిన్ను వాడుకున్నారేదప్ప
నీగతి పట్టించుకున్నవాడెవ్వడు?
నిన్ను వారెరుగరు
నీ శక్తి వారెరుగరు.
సమయం వస్తే ఎదురు పోటు
పొడవగలవనీ
కీలెరిగి వాత పెడితే
పిచ్చికుక్కల్లాంటి టోపీలరాయళ్ళందరినీ
గజ్జికుక్కల్లా పరిగెత్తించ గలవని!
నిన్ను వారెరుగరు, నీశక్తి వారెరుగరు
ఇజాలతో భుజాలు కలిపి
పదవులు పడేసే పట్టెడన్నం కొఱకు
కొట్లాడుకునే గ్రామ సింహాలువీరు
నీ త్యాగం ఈ తెల్లకుచ్చుటోపీల రాయళ్ళకు
మరో తురాయిని చేస్తుందేకాని
నీవు మేల్కొనేదాకా నీకేమీ ఒరగదు
నీవు చంద్రహాసుడవు కాంతప్పుడు

ఓయీ విద్యార్థీ !
నీవు నిజంగా శబ్దవాచ్యుడవు కావాలి !
చరిత్ర చర్విత చర్వణం కాకూడదు !!
తస్మాత్ జాగ్రత ! *

## నా గమ్యం

గమ్యాన్ని చేరాలన్న తపన
మురుస్తూ నీ ముంగిలి చేరిననన్ను
తిరోగమింప జేసింది
నీ ఊహారాకా శరత్కాంతులలో
రాలిపడిన ఉల్కగా
నీదైన ఆలోచనాపథంనుండి నిపతింపజేసింది
నిన్ను కేంద్రంగా-నీచుట్టే తిరుగుతూ
ఎవరినీ కదిలించలేక అదలించలేక
నీ కౌఱకై దాచిన ఆ రెండే రెండు కన్నీటి చుక్కలూ
నీ నిరీక్షణలో రాలిపడినా
నేను గమ్యాన్ని చేరానో లేదో కాని
నా సందేశాన్ని నీదాకా చేరవేయగలిగితే
వాటి ఉనికే ధన్యమౌతుంది
నా జీవితమూ ముగుస్తుంది
కనిపించని అనంతాలదాకా
వేసిన నా చూపుల వలపుల విరిబాటలలో
నీవే బాట "సారి" వౌదువో మరి
నా ఆఖరిక్షణంలోని నీ సమాగమంలో నైనా
నిన్ను చేరానన్న సుషుప్త్యవస్థలో
నన్ను నేను ఆదమరచి;
నీ ప్రేమ సామ్రాజ్యపు పొలిమేరలలో
జోగాడుతున్న నన్ను
కోపగించకు; విసిగించకు;
నీకు తెలుసా మరి !
నాగమ్యం నీవేనని !!
నా సర్వస్వం నీవేనని !!! *

* * *

# జీడిగుంట కామేశ్వరరావు

## ఆకాంక్ష !

బ్రతుకు బరువుల పట్టికా
ప్రణయ కథల పేటికా కాని
జీవితప్రాంగణంలో
నవ్వుల పువ్వులను
మమతల బొమ్మలను
అందంగా పేర్చుకొంటున్న నిన్ను
మరో వసంతం పలుకరించిందని
విన్న శుభసమయంలో ఎవరి ఎద పొంగదు !
భాషకీ భావానికీ అతీతమైన
ఆ శుభసమయంలోని
నీ మానసికోల్లాసం
నిత్యవిలసితం కావాలనీ
నీ జీవితప్రాంగణంలో వెలసిన
మమతల బొమ్మలు
తమ సౌందర్యాన్ని
ఇనుమడింపజేసుకోవాలనీ
ఆ నవ్వుల పువ్వులు
పారిజాత ప్రసూనాలై
నిత్యం పరిమళాలు వెదజల్లాలనీ
నా ప్రగాఢాకాంక్ష !

## నిరీక్షణ

వెలుగు చీకటుల
దోబూచులమధ్య నలుగుతున్న
ఓ మనస్సుకి
నీ ఉనికినిగూర్చిన ఆలోచనే
వ్యథని పోగొడ్తుందనీ—
నిన్నుగూర్చిన ధ్యానమే
హాయిని కలిగిస్తుందనీ—

నిను వెదకాలన్న ఊహే
వెచ్చదనంగా భాసిస్తుందనీ__
నీ దర్శనం పొందాలన్న కాంక్షే
ఆనందాన్నిస్తుందనీ__
నీలో ఐక్యమొందాలన్న తలంపే
తృప్తినిస్తుందనీ__
తెలిసేవుంటుంది నీకు !
నీ రూపెలావుంటుందో,
నువ్వెక్కడ వుంటున్నావో,
ఎప్పుడు కనిపిస్తావో,
ఏమీ తెలియకపోయినా
ఈ ఎద నిన్ను తనలో నింపుకుని
తాను నీలో కలిసిపోవాలని
గుప్తంగా తపం చేస్తోంది !!
ఈ ఎద గంగాఝరియై
నీ పాద ప్రక్షాళన మొనర్చాలని,
కస్తూరియై నీ ఫాలభాగాన వెలగాలని,
గులాబియై నీచే ఆఘ్రాణింపబడాలని,
చందనమై నీవుగా మారాలని,__
ఇలా ఎన్నోకలలు కంటోందని
ఎలా చెప్పను నీకు ?
నీకై నిరీక్షించటం తప్ప
నేను ఏం చేయగలను ?

*

## నిర్లిప్తత

మబ్బుల పూలమాలను ధరించి
వెన్నెల చిరునవ్వు లొల్కబోస్తూ
చంద్రవదనయై
వింతసోయగాలను
వెదజల్లుతూ వెలుగుతున్నది
అక్కడ-నిశాకాంత !.
ఆ వెలుగును చూడలేక
ఈర్ష్యామగ్న మానసయైనట్లు

కన్నులు మూసుకుంటున్నది
ఇక్కడ—ఘాకాంత ! !
ఈమె మెచ్చిన కోడలై
పసిపిల్లలనువలె
ప్రజల్ని లాలిస్తున్న
ఆ నిద్రాదేవి
కవిని కవయలేక
తన హొయలుతో అతడి నాకర్షించలేక
ఆ ఓటమి నంగీకరించలేక
అతడి పరిసరాల్లోనే
తారట్లాడుతోంది ! ! !
అరమూసిన కన్నులతో,
మహదారాధనాభావంతో,
అనురాగభావనతో,
నిశాకాంతను చూస్తూ
ఆమె తలపులతో తన ఎదను
నింపుకోవాలని
తహతహలాడుతున్నాడు కవి—
నిద్రాదేవి ఆగమనాన్ని
మాసిమాడనట్లు నటింపయత్నిస్తూ !

*

## నేను

నేను మానవుణ్ణి !
అందుకే చీకటిని ప్రేమిస్తాను—
అయినా వెలుతురంటే
నాకు అనిష్టంలేదు
అజ్ఞానాన్ని ఆదరిస్తాను—
అయినా జ్ఞానప్రవాహానికి
ఆనకట్ట కట్టమని చెప్పను
ధ్వనిని ఆప్యాయంగా పల్కరిస్తాను—
అయినా నిశ్శబ్దం నా ఎదకు
ఎంతో చేరువయిన రూపం
బలహీనతలంటే అభిమానం—

అయినా మంచితనాన్ని
హరించవద్దని చెప్పను
దౌర్జన్యాన్ని ప్రోత్సహించమనీ
ఉపన్యసించను
అందుకే అంటాను
నేను మానవుణ్ణని ॥

## కదలిబొమ్మ

మధుర మంజుల మనోహర
దరహాస చంద్రికల మోవిపై చిందించుచు
ఘలుఘల్లుమనియెడు కాలియందెలతోడ
హృదయహంసను దరిజేర రమ్మనుచు
సప్త స్వరాల గానమ్ము తోడనే
మకరంద బిందు బృంద తుందిలమగు
భాషణముల భాగ్యమొసగుచు
కమలాల గెలువజాలినట్టి కనుల
దర్శనమ్ము క్షణక్షణమున కొసగుచు
ఆకసమునుబోలు నెన్నడుముతోడ
హొయల యొయ్యారముల నొల్కబోయుచు
అచిర ప్రభాపుంజములరారు మేనుతో
లతల సౌకుమార్యమ్మునే రాజిల్లజేయుచు
ఓకావ్య కన్యకా–సౌకుమార్యమెరుంగని
వజ్రలేఖిని నాది గాన కాదనక
దానితో కరుణ తోడ
కదలిబొమ్మ నీపథమ్మున
పూలరథమ్ములోన ॥

* * *

## ఆచార్య రమ్యశ్రీ

### ఎందుకీ జీవితం !

ఇలా ! ఇలా ! యీ జీవితం
పోతే పోనీ యీ క్షణం.
ఈ దినం ఇచ్చట
మలిదినం మరెచ్చటో ?

ఈ దినం యింటిలో
మలిదినం మంటిలో
ఏటికి ఎదురీదలేక
బక్క చిక్కి శల్యమైన
దైనందిన జీవితం
ఎందుకో ? మరెందుకో ?

అన్యాయాలు చూడలేక
అక్రమాలధాటికి తాళలేక
నిరాశాసౌధంలో
సొక్కి సోలిపోయే
యీ జీవితం ఎందుకో ? మరెందుకో ?

కూడుగుడ్డకు నోచుకోని
కరువు కాలంలో
ఒకరికొకరు ఆదుకోని
స్వార్థపరుల చేతుల్లో
అట్టుడికిపోయే
యీ జీవితం ఎందుకో ? మరెందుకో ?

పీళ్ళులేక
ఇళ్ళులేక
ఎండల్లో మండిపోవు
బ్రతుకెందుకు ?
బ్రతుకెందుకు ?

## ఏ ఒక్కరికో !

రాయాలంటే యెంతోవుంది
కాని
అది రాయబూనితే_ఎద పొంగుతుంది,
ఈ జగాన ఎందరో ఉన్నారు
అందరూ పనికి వచ్చేరా ?
అందులో
ఏ ఒక్కడో అనువైనవాడు.

జగాన ఎన్నోచెట్లు
పుష్పించి ఫలిస్తే
అందులో
భగవంతునికి చేరేది
యే ఒక్కటో !
అందరూ రాసేవారే కవనాలు.

అందులో యే ఒక్కరివో
శారదకవుతవి_స్వర్ణాభరణాలు
అందరూ పాడేవారే పాటలు
మరి యే ఒక్కరివో
అవును అవి పూబాటలు.
దీనంగా ! ఏంలేక
ఆకలితో అలమటించే
ఎంతోమంది భిక్షుకులు ఆర్తనాదాలు చేస్తూంటే
అందులో
యే ఒక్కరికో
పట్టెడన్నము దొరుకుతుంది.

## నినాదాలు

నినాదాలు ! నినాదాలు !
ఎటు చూచినా నినాదాలు
దిక్కు_తెలియక పరుగులెత్తే
కాందిశీకుల నినాదాలు,

చిన్నపెద్దల ఘోరమైన
ఆవేశపు నినాదాలు
ఘనభోంతరాళములో
ప్రతిధ్వనించి భీతిగొలుపు నినాదాలు.
మరతుపాకుల, మరఫిరంగుల,
తాకిడులకు తాళలేక
దుశ్చర్యలనుఖండిస్తూ
బాధపడే శాంతిదూతల
ఎదనుచీల్చి ఉబికివచ్చు
అవే అవే నినాదాలు!
తారతమ్యంలేని దృష్టుల
ఆగడాలు అరికట్టుతూ
ఎదురు నిలిచి పోరుసలిపే
సోనార్ బంగ్లా ప్రజల నినాదాలు!
ఎటు చూసినా "జై బంగ్లా" నినాదాలు
ఎటు చూచినా "జై స్వతంత్ర" నినాదాలు
మారణహోమ జ్వాలలు
మింటికెగసి కాల్చివేయ
పరదేశాలకు తరలివచ్చి—తలదాచుకొని
స్వాతంత్ర్యంకోసం మాత్రం
తలయెత్తి నిలిచే—కాందిశీకుల నినాదాలు
శతవృద్ధుల—సతీమతల్లుల
స్వాతంత్ర్యపు నినాదాలు
నినాదాలు! నినాదాలు!

## సోదరా!

సోదరా! ఓ సోదర!
క్షణం నిలిచి వినరా!
బీదసాద యను భావం
తృటిలోనే పోదురా!
నడుంకట్టి నిలచినచో
నాశనమో కరువు.
నిన్ను నీవు తెలిసికొన్న

అన్ని సాధింతువు
ప్రజారాజ్యమంటూ ప్రజలను పీడించే
మదమత్తుల మైకాన్నిసైతం
పట్టుబట్టి వదులుమురా !
ధైర్యం జేబట్టి నీవు
అడుగుముందుకేయరా
"అస్పృశ్యత" అంటూ–మరి
"అంటరానితన" మంటూ
తుచ్ఛులు పదరెడు మాటలు
తుడిచివేయకదలుమురా
గుండె దిటవు చేసుకొన్న–
అండదండలవే కలుగు
ఈనాడే కాదుగదా
ఏనాడూదేశానికి
ప్రజలేరా సర్వస్వం.
ఋజువైనది ఈ సత్యం,
ముందుచూపుతోడసాగు
అందునులే ఫలం బలం.

*          *          *

# కె. సత్యవతి

## జీవన గీతి

చిత్రమైనదీ జీవితం అందులో
విచిత్రమైనదీ పోరాటం
అనుదినం అనుక్షణం
ఎందుకో తెలియదు.
ఏం బావుకుందామనో తెలియదు
దానికి అంతమెక్కడో అసలే తెలియదు.
బాహ్య ప్రపంచంతో సంబంధం లేక
తల్లి కడుపులో ఏమనుభవించేవో
అంతే! అదే సుఖం అదే హాయి
మళ్లీ పొందవు జీవితంలో తిరిగి ఆ హాయి
అయినా యెంత తల్లైతే మాత్రం
ఎన్నాళ్ళు మోస్తుంది నిన్ను
తెచ్చి పడేసిందీ జీవిత సాగరంలో
సాగించు నీ జీవనసమరం అంటూ.
ములి వెచ్చని తల్లి ఒడిని వీడి
భగ్గు—భగ్గు—మనే ఈ ప్రపంచంలో
ఇమడటానికై సాగించావు నీ పోరాటం—అది పసితనం
పెరుగుతున్న నీతోబాటే
పెరుగుతోంది నీ పరిధి
అమ్మా, నాన్న, అక్కా, చెల్లి, అన్నాదమ్ములందరి
హృదయాల్లో యేర్పరచుకున్నావు ఒక స్థానాన్ని
అంతటితో పూరుకున్నావా?
చుట్టూ ప్రపంచం మీద పడ్డావు
సంఘజీవి నంటూ—
ఐదో యేటే అడుగిడేవు

విద్యార్థి జీవితంలోకి
దాంతో మొదలవుతుందొక చిత్రమైన పోరాటం
జయం వరించిందా, యినుమడించిన
ఉత్సాహంతోను—అపజయం వరించిందా
తెచ్చుకున్న ఉత్సాహంతోను
ఒక్కొక్క మెట్టే ఎక్కేవు
అంతంలేని నిశిధిలో ఆగేవు
ఏమైతేనేం జీవితంలో అదొక చక్కని దశ
బాదర బందీలు లేని దశ
పోరాటం సాగించినంత కాలం
కసురుకున్నా విసుక్కున్నా
చివర్న అయ్యో అప్పుడే అయిపోయిందా!
అనుకునే దశ.
అడుగు పెట్టేవు ఇప్పుడు
అసలైన జీవితం లోకి
ఉధృత మవుతుంది నీ పోరాటం
జీవితం అంటే నిర్వచనం తెలియదు
ఏవో చేసెయ్యాలనే తపన—
చెయ్యలేవు—
కాళ్ళూ చేతులూ కట్టి పడేస్తుంది
నీ నిస్సహాయత
ఎటు చూసినా సమస్యలే
మొదట నీ కాళ్ళమీద నీవు
నిల్చుందికై సాగిస్తావు పోరాటం
ఎప్పటికో ఒకప్పటికి
ఏదో ఒక దారి
దొరక్కపోతుందా అన్న ధైర్యం
నచ్చినా నచ్చకపోయినా
విధిగా స్వీకరిస్తావు దాన్ని
అప్పటికే జీవన సమరంలో

అలసిపున్న నీవు
జీవితంలో యెన్నో యెదురు దెబ్బలు తిన్నావు
అప్పటికే సగం చచ్చిన మనిషివి
అంతటితో వూరుకున్నావా ?
అన్నిటికంటే లోతైన
సంసార సాగరంలోకి దూకేవు
ఎదురీదడానికి ప్రయత్నించావు
తెలిసికూడా.
తినడానికి తిండిసమస్య
కట్టడానికీ గుడ్డ సమస్య
ఉండడానికి గూడు సమస్య
మనిషికి మనుగడే సమస్య
వీటికితోడు___
నీమీద ఆధారపడి నీ చుట్టూ వున్న
మనుష్య లోక సమస్య.
రేపుమీద పెట్టుకున్నావు
నీ ఆశలన్నీ.
ధైర్యంతో ఎదురీదబోయావు
ఒకదానిమీద ఒకటి
అలల్లా వచ్చి పడ్డాయి బాధ్యతలు
ఒకటి పూర్తవుతే మరొకటి
అయినా సముద్రపుటలలు
ఆగుతాయని చూస్తారా ఎవరైనా
నీ భ్రమగాని :
ఒకదానితో ఒకటి పోటీపడి
ఆకాశపు టంచుల్ని అందుకోవాలని
ప్రయత్నిస్తున్నాయి. అయినా
సాగించేవు నీ జీవనసమరం
బాధ్యతాయుతుడైన యోధునిలా
నీ గురించి నీవు విస్మరించేవు

నీ బాధ్యతల్నే గుర్తుపెట్టుకున్నావు
ఒకదాని తరువాతొకటి నిర్వర్తించేవు
గొఱ్ఱె తోక సామెతని ఋజువు చేసేవు
అప్పటికే నెరిసి పోయింది నీ తల
ఎంగి పోయింది నడుం
ఉడిగి పోయింది సత్తువ
సాగించేవు ఇంత సుదీర్ఘమైన పోరాటం
ఏమి సాధించేవు జీవితంలో
అనుదినం అనుక్షణం
ఆశా, నిరాశా, నిస్పృహా, నిస్సహాయతల
మధ్య కొట్టుమిట్టాడేవు
జీవితానికి పరమార్ధమేమిటో తెలియదు
ఒక జడత్వం ఆవహించింది
ఏదో చెయ్యాలనే ఆ తపన చచ్చి పోయింది
ఏం చేసినా నీ చేతిలో లేదు
ఆ విధాత చేతిలో
కీలు బొమ్మలా ఆడటం తప్పదని
నిన్ను నువ్వే సరిపెట్టుకున్నావు
అయినా యెందుకో తాపత్రయం
మనిషికి మనుగడ ఉన్నంత కాలం
తప్పదు మరి
అందుకే అనిపిస్తుంది
చిత్రమైనదీ జీవితం అందులో
విచిత్రమైనదీ పోరాటం
అనుదినం అనుక్షణం
ఎందుకో తెలియదు
ఏం బావుకుందామనో తెలియదు
దానికి అంతం ఎక్కడో అసలే తెలియదు. *

* * *

# జీ. కుమారస్వామి నాయుడు

## యుగ ధర్మం

పేదయుగం కాదిది పేదయుగం
ఇక్కడ అన్నార్తుల సంఖ్య అసంఖ్యాకం
తన యింటిముందు కంటిముందు
ఆకలితో అలమటిస్తున్న మనిషిని
ఖాతరు చేయకపోగా కసిరికొట్టి
మానవత్వపు విలువల నెక్కడికో విసరికొట్టి
తడి బట్టలతో గుడికి పోతే
దేవుడు మాత్రం సంతోషిస్తాడా ?
పాపం యేమైన ఉపశమిస్తుందా ?
రక్తం పంచుక పుట్టాడు మనిషి
రాతిని మలచగ పుట్టాడు దేవుడు
మనిషి యన్నవాడే లేనినాడు
దేవుడికి దిక్కెవ్వడూ ఉండబోడు
అందుకే
దేవుడికి దణ్ణం పెట్టడంకంటె
ఆకలి గొన్నవారికి అన్నంపెడితే
దేవుడానందిస్తాడు, హర్షిస్తాడు
దీవిస్తాడు, కాంతిపథం చూపిస్తాడు

## కాలం వేసిన గాలం

కాలం వేసినగాలం గుండెల్లో గుచ్చుకొంది
లోకం నదిలోనుండి శోకపు గట్టుకు విసరింది
ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి అవుతుంటే
కాలం సంతోషంగా నవ్వుకొంది
ప్రాణం పోక కళ్ళు తేలవేస్తుంటే
అదే తనకు తమాషా అన్నట్లు చూసింది
చేపకు చావుతెలివి వచ్చింది
అచ్చంగ చచ్చినట్లు నటించింది
కాలం గాలాన్ని పీడదీసింది

చేప ఒక్క ఉదుటున యెదుటనున్న నీటిలోకి దుమికింది
కాలానికి గాలానికి అందనంత
సుదూర తీరాలకు వెళ్ళింది
గళమెత్తి కాలాన్ని కసితీరా వెక్కిరించి నవ్వింది *

## పువ్వులు నవ్వుతున్నాయి

పువ్వులు రాలుతున్నాయి
రాలిపోయిన పువ్వులు నలుగుతున్నాయి
నలిగిపోయిన పువ్వులు నవ్వుతున్నాయి
పగలబడి విరగబడి సంఘం కట్టుబాట్లపై తిరగబడి
నలిగిపోయిన పువ్వులు నవ్వుతున్నాయి
గతాన్ని తలచి కుళ్ళి కృశించడం లేదు
భవిష్యత్తునూహించి భయపడడం లేదు
రాల్చిన హృదయంలేని చేతులను జూచి
నలగ ద్రొక్కిన కన్నులేని కాళ్ళనుజూచి
కట్టుబాట్ల మాటున కాలుష్యాన్ని దాచి
కుళ్ళిపోతున్న సమాజాన్ని జూచి
నలిగిపోయిన పువ్వులు సంఘమై
జాతిలో ఒక అంగమై
నీతికి ఆధారమై ప్రగతికి ఉదాహరణమై
పగలబడి విరగబడి సంఘం కట్టుబాట్లపై తిరగబడి
నలిగిపోయిన పువ్వులు నవ్వుతున్నాయి—నవ్వుతున్నాయి.

## "చికిత్స"

ప్రకృతిలోని సుకృతులను చూడలేని
కన్నులున్న కబోదులకు సులోచనములివ్వబడును.
ప్రకృతి వికృతిగ భావించే పిచ్చివాళ్ళకు
ఉచిత చికిత్స చేసి పిచ్చి వదలింపబడును.
మనసుకు తగిలిన విరక్తి గాయాలకు
రక్తి పత్తులు వేయబడును
బండవారికి గుండెలు తీయబడును

జాలువారెడు గుండెలు చేర్చబడును
ఇక్కడి చికిత్సకు పేరు ప్రేమ
మందులు సువాక్కులు
ఆపరేషన్ ఆయుధాలు మమతానురాగాలు
ఆసుపత్రిలో సిస్టర్లు అహింసామానవతలు
వెలుగు యేర్పకుండ చీకటి నవ్వకుండ
కట్టిన సమాధులపై యీ భవనపు
పునాదులు వేయబడెను
విరాళాలిచ్చిన దాతలు భవన నిర్మాతలు సుబుద్ధులు
బాటలు వేసిన జేతలు తోటలు పెంచిన మాలీలు అశోకులు

## సమాధి

ఆత్మ చుట్టు ఉన్న గోడలు
అనుభవం, వేదాంతం
వీరత్వం, వానరత్వం
అమాయకత్వం, అబలత్వం
వీరత్వానికి వేదాంతంతో పోరాటం
వానరత్వానికి అనుభవంతో చెలగాటం
అబలత్వం అడ్డుచెప్పలేదు
అమాయకత్వం యెదిరింపలేదు
ఆత్మ యెంత ఘోషించినా
పోరాటం వినలేదు
చెలగాటం చెవినిపెట్టలేదు
ఆత్మకు అభిమానం దెబ్బతినక తప్పలేదు
ఆత్మ హాలాహలాన్నైనా మింగుతుందేగాని
అభిమానం దెబ్బతింటే బ్రతుకుతుందా ?
ఆత్మ హత్య చేసికొంది
గోడలన్ని మేల్కొని గొల్లున యేడ్చాయి
పశ్చాత్తాపముతో ఆత్మ బ్రతుక్కి సమాధి కట్టాయి
ఆత్మను బలిపెట్ట సమాధికట్టి పూజిస్తే

ఏ ఆత్మైనా శాంతిస్తుందా ?
సమాజం కన్ను కప్పగలుగుతుందా ?
కాలం ఖర్చు వృథా కాగా
ఫలితం పూజ్యం అయినా అవుతుందా ? *

## ఆకాశాన్ని అవలోకించు

అవకాశం దొరికినపుడల్లా
చూడు ఆకాశాన్ని
సంద్రంలో నీరు ద్రాగి
ఎక్కడో వెదజల్లడానికి వెళ్ళే
మేఘంలో పుట్టి క్షణిక జీవి అయినా
విద్యుల్లత కెందుకో ఆ తళుకులు బెళుకులు
ఉదయం సాయం వేళలలోగూడా
వంకరగ తప్ప నిటారుగ బ్రతుకలేని
ఇంద్రచాపమెందుకు సంతరించుకుందో అన్ని రంగులు
చీకటి పుణ్యాన
ఎవరెవరు ప్రభవిస్తారో
ఎలా రాణిస్తారో
భాస్కరుడెలా ఉదయిస్తాడో
తమస్సుతో బ్రతికే వాళ్ళను తమస్సును
ఎలా తుడుస్తాడో
విశ్వాన్ని యెలా వెలిగిస్తాడో
అవకాశం దొరికినపుడల్లా
అవలోకించు ఆకాశాన్ని
విలోకించు నీ వివేకాన్ని. *

* * *

# తల్లాప్రగడ రాజారాం

## వసంత శోభ

నవవసంతము తొంగిచూచెను
మావిమోడులు చివురులెత్తెను
జాజిమాలతి జంటపూచెను
మల్లెమొగ్గల సిగ్గు తొలగెను.
తీర్చిదిద్దెను ప్రకృతిసుందరి
తేటసీటను చూచి మోమును
తిలకమద్దెను పూలు ముడిచెను
సోయగపు చేలమ్ముగట్టెను.
కొసరె కోయిల కొమ్మలోపల
కోరికల కోవెలల లోపల
ముసిరె తేటులు పూలగుత్తుల
తేనెలను ముదమార గ్రోలగ.
నీలినింగిని ఉదయరాగం
అలముకొన బోతున్నదదిగో
దినకరుని ఆగమనమునకై
యెదురుచూచెను ముగుదకమలం.
గాలితాకగ నీటిఅలలను
మేలిముగ్గులు కానుపించెను
సోలెతేటులు విరులతేనెల
గ్రోలి అలసట కొంతతొలగగ.

## ప్రేయసీ !

నీ నగుమోముటద్దమ్ములో
నా ప్రతిరూపమే చూడనీ
ఈ వేళ మనసాయె
నా కనులు కనగోరె.

నీ తలపె నాలోన
పరవళ్ళు త్రొక్కాలి
నీ రూపె నాలోన
నిరతమ్ము నిలవాలి.

కనువిందు కలిగించె
కరుణామయి ప్రకృతి
అలరించి అందించె
అందాల మాధురులు.

దివినిండి వినిపించె
దివ్యమంగళగీతి
నీ కన్నుసన్నలే
నా మనసు వన్నియలు
నీ రూపమె నా
జీవనరాగము
నీ నగుమోముటద్దమ్ములో
నా ప్రతిరూపమే చూడనీ. *

## వందనము

బాలభాను డుదయించె నదిగో
శ్వేతకమలము విరిసెనదిగో.
మేలుకో యికనయిన దేవా... మా మన
సేలుకో యిటుపైని దేవా.
సర్వజగతి సౌందర్యము
సంతరించుకొనుచున్నది
స్వచ్ఛ, స్ఫుట హిమబిందువులు
మల్లెపూలమీద నిలచె
పలుకరించెను పూలు
పులకరింపగ మేను

నిను పూజ సేయగా
నిలచె సర్వస్వమ్ము.... ॥మేలుకో॥

ప్రశాంత సమయాన
ప్రసన్న వదనముతో
హృదంతరాలను
సుశాంతి నింపగ.... ॥మేలుకో॥

విశాల భావపు
వికాస జీవనము
వరాలమూటగ
వరింప వేడెద.... ॥మేలుకో॥

## శారద రాత్రి

ఆ శారద రాత్రిలో
ఆ వెన్నల కాంతిలో
ఆ పూవుల తావిలో
ఒక తెల్లని మొయిలునీడ.

యెదను మరచి కథను తలచి
చెలి ఒడిలో తలనుదాచి
రమ్యమైన కలనుగంటి
కమ్మనయిన పాటవింటి

మరువలేను ఆ సుఖాన్ని
విడవలేను ఆ ధనాన్ని
నా హృదయపు సోయగాన్ని
నా మక్కువ పాయసాన్ని

మా సఖ్యం మా ప్రణయం
క్షణక్షణం విరబూచెను
భవితవ్యపు శుభసమయం
అనుక్షణం ఆలరించెను.

*

ఆ శారద రాత్రిలో
ఆ వెన్నెల కాంతిలో
అది నా హృదిలో స్వప్నం
అది యొక మధుర స్వర్గం.

## పూబాల

పూబాల నోయీ
నను మురిపాల లాలించి
సరసాల తేలించి
కనుపాపలను నిలుపుకో
నిన్నమొన్ననే విరిసిన కన్నెను
చిన్ననాట నువు వలచిన వన్నెను
వెన్న నోటతినిపించు మిన్ననని
వీణపాట వినిపించు చెలియనని
మెచ్చితివా నాడు వచ్చితి నీనాడు
గడుసరి బాలనూ విరిసరి వేలనూ
ఏమందువూ ? నను కరుణింపవా ?
ఈ పూబాలనూ

నీలో భక్తితో చేరాలనే
నీలో గానమై కరగాలనే
నీలో లీనమైపోవాలనే
నినుచేరి ముక్తిని పొందాలనే పూబాలనూ. *

* * *

# శ్రీపతి రఘురామ్ కుమార్

## నా జీవన స్రోతస్విని

ఆత్మకథని వ్రాయడం లేదు
జీవనయానంలో గడిచిన పజిలీలపై పై
సింహావలోకనం చేసుకుంటున్నాను.
అనుభవాలను నెమరువేసుకుంటున్నాను.
నా యీ జీవనగంగ ఎన్నో మలుపులు తిరిగింది
ఎటు ప్రవాహమో ? ఎటు గమ్యమో ?
'జాతస్యమరణం ధృవం' అని తెలుసు
పోయేలోగా_నిలిచేదేదైనా చేసిపోవాలని
ఉన్నన్నాళ్ళూ, పోకుండా మిగిలేదేదైనా
మిగిల్చివుంచాలని, తపన.

* * *

నన్నూ ఓ తేటీ లోకానికి పరిచయంచేసింది
నాకూ ఓ పేరు ఈలోకం నిర్ణయంచేసింది
గ్రహం ఆగ్రహాలపై గురిఉన్నా లేకున్నా
గతులు సాగుతూనే వున్నాయి.
అర్ధరాత్రికి అటుగా పుట్టినట్లున్నాను
బాల్యంలోనే ఆరిష్టాల బారిపడ్డాను
రైల్లో నావాళ్ళల్లో తప్పిపోయి
క్రోయల పెంపకంలో సాగవలసిన జీవితం
ఓ క్షణంలో తప్పిపోయింది.
కన్నవాళ్ళ ప్రేమను దినందినం కొత్త ఊపిరిగా పోసుకుని
ఆప్యాయత అనురాగాల మాధుర్యం చూసుకొని
ఎదిగే అదృష్టాన్ని నిలిపిపోయింది.
బాధ్యతలూ హక్కులూ సమానంగా ఉండే జ్యేష్ఠుడిని.
అయినా ఒకందుకు దౌర్భాగ్యుణ్ణి

అక్కచెల్లెళ్ళ అనురాగ స్రవంతికి నోచుకోక
ఆ చల్లదనం కోసం ప్రతిక్షణం ప్రకృతిలో వెతుక్కుంటూనేవున్నాను.

* * *

పదాల అర్థం తెలియని లోకోక్తుల నిర్వచనాలెరుగని-వసితవంలో
అమ్మ తమ్ముణ్ణిఎత్తుకుని ఆస్పత్రివైపు కదుల్తున్నప్పుడు
'నీ చేతిమాత్ర వైకుంఠయాత్ర' అన్నమాట వెలువడి నప్పుడు
నా బాలవాక్కు బ్రహ్మవాక్కవడంతో అవాక్కయి పోయాను.
నలుగురు తమ్ముళ్ళూ
తామువెళ్ళే మరోలోకంలో తల్లిప్రేమ దొరకదనేనేమో
అమ్మ ఒక్కొక్క ప్రాణాన్నీ
అమ్మకు ప్రతీకగా పట్టుకుపోయారు.
నలుగురూ పట్టుకుపోగా మిగిలిందొక్కటీ
ఓదినాన ఆనలుగురినీ చేరింది.

* * *

అమ్మ-
మాటలోనూ, మనసులోనూ చల్లదనం అమ్మ.
ప్రేమ పాటగామార్చి తన గళంనుండి మధురంగా మ్రోయించి
నా నేత్రయుగళాన్ని తాదాత్మ్యంలోకి జోకొట్టే అమ్మ
ఎందుకెళిపోయింది అమ్మ
చివరిక్షణం వరకు భర్తమాట కెదురాడక
తన మనసు తెలిసి మసలుకోలేదని మనసులోనే కుమిలిపోయి
ఆరోజుమాత్రం ఆత్మగా వెళ్ళిపోయింది.
కళతో విస్తరిస్తున్న నాన్నను
నాలుగురాళ్ళు తెచ్చుకుంటూ ప్రయోజకుణ్ణయిన నన్నూ
చూడడానికి ఇవాళ ఆమెలేదు.
ఆమెను సుఖపెట్టే అదృష్టానికి మేం నోచుకోలేదు
ఆమెలేని లోటుమాత్రం మమ్మల్ని వీడిపోలేదు.

* * *

జీవయాత్ర సాగించేందుకు చద్దిమూటగా ఉపయోగించే
ఉపాధిని వెతుక్కుంటూ ఊళ్ళన్నీ తిరిగాను.

కోమటి గుమాస్తాగా, కాజువల్ లేబర్‌గా,
సి డబ్ల్యు డి మేస్త్రిగా, ప్రొబేషనరీ
ఉపాధ్యాయునిగా ఉన్న ఉద్యోగాలన్నీ చేశాను.
అన్నిటికీ ఉద్వాసన చెప్పాను.
అల్మోస్ట్ సెటిల్డ్ అనుకున్న లైఫ్‌ని
ఆల్వేజ్ స్ట్రగుల్‌గా మార్చి,
ఆడిటర్ ఉద్యోగాన్ని ఆశయాలవేదిలో జార్చి
భాగ్యనగరానికి నాభాగ్యాన్ని వెతుక్కుంటూ వచ్చాను.
అక్కడ—'ఆంధ్రజనత' చిన్నగానే చూసింది.
అనుభవాన్ని పురస్కరించుకుని
గతంలోని వృత్తుల్ని మళ్ళీ కొన్నాళ్ళు పంచుకున్నాను
ఇంతలో—జీవితభీమా సంస్థవారు
జీవితంలో స్థిరపడే అవకాశం ఇచ్చారు.
పదిమంది జీవితాల్ని భద్రపరచమన్నారు
సంతోషంగా స్వీకరించాను.
పరిధిపెరిగిన కొలది ఆశలవల పెరుగుతుంది.
కళ నన్నా కర్షింపజేసి నన్నారాధింప జేసింది.
కళావాహినిలో కొన్నాళ్ళు కొట్టుమిట్టాడాను.
కొట్టు మిట్టాడుతుండగా, జీవితంలో నాకుతోడుగా, జోడుగా,
నా హృదయేశ్వరి జీవితప్రాంగణంలో అడుగుపెట్టింది.
నా జీవితవ్యాపారంలో భాగస్వామినిగా చేరింది.
వ్యాపారం ఆర్థికంగా నష్టాలకు దారితీసింది
అపనిందలనుపేసే ఆత్మీయులు
ఋణం కన్నా దారుణంగా బాధిస్తున్నారు
దిక్కేది కనరాక, ఆపదమొక్కులవాడి కక్షీ పెట్టుకున్నాను
మనుషుల్లోని మంచిని వెలికితీసి,
మంచిని పెంచే స్తోమత కల్పించి, నన్ను కరుణించమని.

* * *

నాన్న- అపూర్వచిత్రకళలో
అద్వితీయశక్తితో చిత్రాలురచించే నాన్న.

నికరాదాయంలేదనీ, నిల్వచేసిందేమీ లేదనీ, నిరసనగా
నాకునేను దూరంగా ఉంటూవచ్చిన నాన్నగి
అసహ్యోకుండా చేరువయ్యాను.
అసమాన ప్రతిభ గుర్తించాను
అనితరసాధ్యమయిన కళాఖండాలను
దేశమంతా ప్రదర్శించాలనుకున్నాను, పూనుకొన్నాను.
షష్ఠ్యబ్దాలకు చేరువలోవున్న ఈ వయసులోనైనా
కళాసుమాల్లోని కీర్తిపరిమళాన్ని
దశదిశలా వ్యాపింపజేయాలని, ఆశ, ఆకాంక్ష.

* * *

నా జీవనగంగ ఎన్నిమలుపులు తిరిగింది ?
ఎన్ని ఎత్తుపల్లాలు ఎక్కిదిగింది ?
ఇప్పుడు చిక్కని మైదానంలో
గమ్యంవైపు గమనాన్ని చిరునవ్వుతో అలవోకగా సాగిస్తున్నది
లోతుపెరిగింది, వడిపెరిగింది సవ్వడి తగ్గింది.
చావుపుట్టుకల ఒడ్లను ఒరిసి పారుతోంది
కనుచూపు మేరలో కానరాని
ఇంకెన్ని ఎత్తుపల్లాలను దాటాలో ?
ఎన్ని వాగులతో వేగాలో ?
ఎన్ని బండరాళ్ళు బద్దలుచేయాలో ?
ఠీవిగా నిలబడ్డ ఆకాశానికేం తెలుసు నాలోతు ?
తలదించుకు నిలబడ్డ భూమికేం తెలుసు ?
వడైనా రాపిడైనా పడేనాకుతెలుసు__*

* * *

## ఎల్. సుచేత

### మూగవేదన

నీ పేరు తలిస్తే—
నిన్ను చూడాలని తపిస్తాను కాని
సమయం వచ్చినపుడు వెనకముందు లాడతాను
నీ చిరునవ్వు పెదవులు
నా జీవిత రహస్యాన్ని
తెలుపుతున్నామంటాయి—
నీ నీలి కన్నులు ఏవో తెలీని అర్థాలు
తెలుపుతాయి—
అవి నన్నేలోకాలకో తీసుకొని పోతున్నాయి.
పదములు పెదవులు దాటిరావు
నాబాధ చెబుదామంటే—
కనులతో బాసలాడుదామంటే—
సరి కనులేమో నా మనసు
చెప్పినట్లు వినవు—
బరువెక్కిన మనసులో
కొండంత ఆశతో
నీకు మొరపెట్టుకుందామనే వచ్చాను
కానీ ఏమీ చెప్పలేకపోయాను—
పూజారి వేళ అయిందని తెరదించినా
ఏమీ తెలియని అయోమయంలో
నడుమ ఎటూలేని తోవలో....
చల్లగవీచే గాలులు—
సూర్యాస్తమయంలోని ప్రశాంతత
నీవే నేనని
నేనే నీవన్న
పరమ రహస్యాన్ని తెలియజెప్తుంటే—
చిద్విలాసుడవైన
నిన్నుజూస్తూ....
మౌనంగా మిగిలిపోయాను.

## ఊహాపేరి

ఊహాలు నాఊపిరి
ఊహాలే నాప్రాణం
ఊహే నేను - నేనే ఊహ
కాలం అంటూ తెలియదు
మరి ఊహల లోకాల్లో
అందుకే ఊహాలెన్నో
ఊహిస్తూ-ఈ కాలాన్ని గడిపేస్తా-
నిరాశను తలపింప జేయనిది
ఈ ఊహే అయితే-
నిస్పృహను పారద్రోలేటి-
అదే ఊహ
పెదవులపై చిరునవ్వును
చిందింపజేసి
మదిని పరవశింప జేస్తుంది
అందుకే- ఊహాలేవి
బ్రతుకు వృధా అనిపిస్తుంది-
ఒంటరితనాన్ని దూరం చేస్తుంది
చీకటిలో కాంతిరేఖ అవుతుంది
దిక్కు-లేదని విలవిల్లాడితే
దిక్కు-చూపుతుంది
చుక్క-లతో చెలిమి చేయమంటుంది-
అందుకే ఊహాలే నాప్రాణం-

*

## తాపత్రయం

ఎందుకీ తాపత్రయం ? దేనికోసం ఈ తాత్రపయం ?
తోటి మానవుడిని చూడలేక-వాడి రక్తం కళ్ళచూస్తావు.
నోరులేని జంతువుల కళ్ళకు-కసాయివవుతావు
స్నేహాన్ని లెక్క-చేయవు. బంధువర్గాన్ని త్రోసి పుచ్చుతావు.

రక్తసంబంధాన్ని కూడ త్రెంప చూస్తావు.
కాని ఎందుకోసం ? ఎవరికోసం ? ఈ తాపత్రయం.
ఇంతా ఎందుకు చేస్తున్నావో తెలుసుకోని గ్రుడ్డివాడివి
అంతా కావాలనే స్వార్థపరుడివి.
ఇతరుల బాధలనాలకించని చెవిటివాడివి.
అథవా ఆలకించినా తీర్చలేని అసమర్థుడివి-
మరి భీరుడివి కూడా
ఎందుకు ? నీదేమైనా పోతుందని భయం !
కాదు, మరే కష్టం నిన్ను పట్టుకుంటుందోని పిరికితనం-
అందుకే దూరంగా ఉంటావు దులుపుకుపోతావు.
పలుకే బంగారం అన్నట్లు తప్పించుకుంటావు
ఇంతానీవు తాపత్రయ పడేది దేనికోసం ? ఎందుకోసం ?
చివరకు మిగిలేది ఏమి ఉండదు. నీకు సరిపడ్డ నేలతప్ప.
నీ ఆలోచనలు, కోర్కెలు ఈ తాపత్రయం బుగ్గిఅవుతాయి
ఏమి ఉండదు చివరకు-నీ నా సంబంధం.
మరి ఎందుకీ తాపత్రయం ఎవరికోసం ? ఎందుకోసం ?

## మార్పు

కావాలిమార్పు-రావాలిమార్పు
ఇల్లు కట్టడంలో కాదు రోడ్డు వేయడంలోకాదు
మనలో-మన మనసులో
కావాలి మార్పు-రావాలి మార్పు.
ఆకార వికారాలలో మార్పు వద్దు
వేదిక ఎక్కి అరవడంలో అంతకంటే వద్దు.
రావాలి నీ ఆలోచనలలో-వాటిని ఆచరించడంలో
రావాలి మార్పు-కావాలి మార్పు
ఎదుటి వారిని మోసం చేసి జీవించడం మాను
మారేడుని మసి పూయడం ఆపు
నీతులు చెప్పి నేతులుతాగే నీ బుద్ధిలో

రావాలి మార్పు-కావాలి మార్పు.
ఒకరంటే గిట్టని నీ ప్రవర్తనలో
ఒకరు బాగుపడితే చూడలేని, ఓర్వలేని తనంలో
ఇంకా అంటే
నీ జీవిత విధానంలో
రావాలి మార్పు-కావాలి మార్పు,
ప్రతిమనిషిలో కాసంత మార్పు
ప్రపంచానికే అతి పెద్ద మార్పు
రావాలి కావాలి మార్పు.

## పువ్వులనవ్వు

నవ్వుకో నవ్వుకో-
నవ్వు అనే పువ్వును
నీ పెదవులపై నిలుపుకో-
వాడ నివ్వకు దానినెప్పుడు.
నిరాశను అణిచేసి,
నిస్పృహలను దాటేస్తూ-
జీవితం సుఖమయం అనుకున్నపుడు
నవ్వే-నీ సొంత మవుతుంది
నిన్నంటి పెట్టుకునుంటుంది-
నువ్వు, నేను నవ్వేందుకు ప్రయత్నిస్తే
మనల్ని చూసి మరొకరు
వారిని చూసి మరికొందరు
ఇలా ఎప్పుడూ-
నవ్వే ప్రపంచం-
ఎంతబావుంటుంది !! *

* * *

# వా సం

## ఎంతకాలం ఊరుకుంటావ్ ?

పేదవారి పేగులు బావురుమంటుంటే
కాలచక్రమొకవైపు—శరవేగంగా పోతుంటే
ఆకలితో అలమటించే—ఆవేదనలు—ఆక్రందనలు
స్వార్థపరుల కబంధ హస్తాలలోని
స్వార్థులు బలియౌతుంటే
కర్తవ్యాన్ని మరచి— కళ్ళుమూసి
కాళ్ళుచాచి—వెల్లికిలాపడుకున్న
నీ వెర్రితనం చూస్తుంటే
ఏమో అనాలనిపిస్తుంది—కాని
అమాయకత్వం—అడ్డొస్తుంది.

మార్కెట్లో సరకుల్ని మాయంచేస్తూ
గోదాములలో ధాన్యం కొల్లలు నింపేస్తూ
బ్లాక్ మార్కెట్టుచేసేస్తూ
పేదవారి రక్తాన్ని బగ్గడుగా దోస్తుంటే
చిక్కిపోయిన దేహాలనుచూస్తూ—
చచ్చిపోతున్న జీవులనుచూస్తూ
వేళ్ళపైన
మీనమేషాలు లెక్కిస్తూ
ఎంతకాలం ఊరుకుంటావ్ ?

నీతీ—నిజాయితీ మరచి
నిలువుదోపిడి చేస్తుంటే
నీకునీవే దూరమై—దేశానికి భారమై
అంతులేని ఆవేదనతో—
ఆకాశాన్ని తిలకిస్తూ
ఎంతకాలం ఊరుకుంటావ్ ?
తిండిలేని కొరత—కంటిలోన కాన్పించగ
బట్టలేని కొరత—వంటిమీద గాన్పించగ

దోపిడి దొంగల రూపు—దారిలోన గాన్పించగ
కడుపుకాలిన బ్రతుకుల—ఆక్రందనల—ఆవేదనలు
అంతులేక వినవస్తుండగ—నన్నుకాదని—నేనుకాదని
ఎంతకాలం ఊరుకుంటావ్ ?

## కవిత

పండితులారా !
పండితోత్తములారా !
కవుల్లారా !
కవిపుంగవుల్లారా !
నే కవిత వ్రాస్తానని
మీకు చూపిస్తానని
కలనైన ఊహించలేదు
కమ్మని కలలు కనలేదు
కానీ !
కాలం కలసివచ్చింది
వాణిముందు కొచ్చింది
కలంచేతి కిచ్చింది
కాగితం ముందు పెట్టింది
కన్నులెఱ్ఱచేసింది
కవిత వ్రాయమన్నది.
కమ్మని కవిత వ్రాస్తావా ? లేదా ? యని
కసరి కసరి కొట్టింది
అప్పుడు చేశానేమిటి ?
వ్రాయకతప్పదేమోయని
యువకవుల హృదయాలకు
భావకవిత పరువాలకు
ఆనకట్ట లడ్డువేసి
పేదవారి హృదయాలను
పరిశోధిస్తూ స్పర్శిస్తూ
కాగడాలు వెలిగిస్తూ
పగడాలతో పోలుస్తూ

పండిస్తున్నలేని కవితను
చిందులు త్రొక్కిస్తూ
ఊరులుదాటి
ఏరులు దాటి
కొండలుదాటి
కోనలుదాటి
భూలోక-భువర్లోక-పాతాళంలో విహరిస్తూ
చక్కనైన భావమును
చుక్కల్లోన ఊహిస్తూ
కనుగొన్నది కన్నుల్లో
వాక్కుల్లోన కురిపిస్తూ
అలంకరించాను కవిత
ముందుంచాను నవత

## మాటలు

మాటలపేటికలెన్నో-కదలించాయి నన్ను
మాటల-మాటలలోనే
కనిపించాయి తేడాలెన్నో
మాటలలోని తేనె
నడకలలోన-సున్న
పెద్దల-పిల్లల మాటలు
సద్దియన్నము-మూటలు
నాయకాదుల మాటలు
నరకకూపానికి బాటలు
చిన్నిపాపల-మాటలు
మంచిరతనాల-మూటలు
అమ్మలక్కల మాటలు
రొమ్ములు చీల్చే బాకులు
ఇరుగు పొరుగుల మాటలు
కొంపలకాల్చే మంటలు
వదరు బోతుల మాటలు
సీటి సీది బాటలు

కన్నతల్లి మాటలు
దివ్యామృతధారలు
వేదికపైని మాటలు
త్రాచుపాము కాటులు

అన్నదమ్ముల మాటలు
అగ్నిజ్వాలల జంటలు
సినిమా రంగపు మాటలు
సెక్స్‌లో దింపే బాటలు

మహాత్ముని మాటలు
మంచితనానికి బాటలు *

## శ్రీ లక్ష్మీనారాయణ

కోమటిపల్లి, గ్రామమున కొల్వుసుదీర్చిన లక్ష్మీనాధుడే
నామము దాల్చినన్ మదిని నాతని బ్రోచును శాంతమూర్తియై
కామము క్రోధమున విడచి గాంచుడుస్వామిని చిత్తశుద్ధితో
బాముల బాపి మిమ్ము తన భక్తుల జేయును ధర్మదాతయై

కోమటిపల్లి గ్రామమున కొల్వును దీర్చిన దేవదేవ నా
నామమునిల్పవయ్య మది నాలుకపై కలకాలమెల్ల నీ
కోమలమైన నామమును కోరి భజించెద చిత్తశుద్ధితో
భామల గోరలేక తమ పాదముకోరితి నైక్యకంఠముగా

కాలము నిల్వబోదు కలికాలపు చక్రమునాగకుండ దా
నాలుక జాపిమానవుని నాయువు నంతను మ్రింగుచుండునా
కాలుడు రాకమున్నె వెదకందగు జీవితసత్య మార్గ మాం
దోళన జెందనేల మన దోసిలి జేరిన వెన్కజాములో

నీదగు పాదపద్మములు నిక్కము కొల్చెద నెంతొ ప్రేమతో
కాదనకయ్య నన్ననిక గాయమునాదిది నిల్వబోదు నీ
పాదములంటి మ్రొక్కెదను పాపము దొలగ మోక్షకామినై
వేదనతీరు కాలమిది వేగమె బ్రోవుము శ్రీనివాసునిగా. *

* * *

# ఆచంట అంజని

## "ఏమిటీ ప్రపంచం"

ఏమిటీ ప్రపంచం....?
ఎక్కడికి పయనిస్తోంటీ లోకం... ?
పురోగమనానికా....లేక తిరోగమనానికా ?
దారీ, తెన్నూ తెలియక, గమ్యం దొరకక
మిట్టమార్గాల పయనిస్తోంది....
ఎక్కడికో....ఎక్కడికో....
తెల్లమనుషులు, నల్లమనుషులు....
కార్ల మనుషులు, కారు తుడుచు మనుషులు....
పై తరగతి మనుషులు, మధ్యతరగతి మనుషులు,
భిక్షమడుగు మనుషులు....
ఏమిటీ విభేదాలు....ఏమిటీ తారతమ్యాలు ?
డబ్బు లేని మనిషిని డబ్బున్న మనిషి "ఛీ...."
అంటాడెందుకు ?
దూరదూరాలకి పారిపోవాలని
ప్రయత్నిస్తాడెందుకు ?
సాటి మనిషిని కుక్కలా విదిలించికొట్టే మనిషే
పదవులకోసం కుక్కలా పరిగెడతాడెందుకని.... ?
అందరిలో ప్రవహించేది ఒకేరక్తమైనా,
మనిషికి మనిషికి మధ్య
ఎన్నో అంతరాలు....చెప్పలేని కొన్ని యోచనాల దూరాలు....
డబ్బుతోనే సమస్యలనెన్నిటినో తెచ్చిపెట్టుకొని,
సతమతమవుతున్నాడు ధనవంతుడు....
డబ్బు సమస్యేలేని బీదవాడు
ఉన్నదానితో తృప్తి పడతాడు....
అయినా డబ్బుకే దాసోహం అంటారు ప్రజలందరూ....
వారికే జేజేలు కొడతారు ...
ఏమిటీ విచిత్రం ?
ఫాషను బురఖా తొడుక్కున్న మనిషిని
అందలాల కెక్కించేస్తారు....
ఛ్ఛరో,....బురఖా లేనివాణ్ణి

పాతాళానికి దిగ్రగొక్కేస్తారు....
ఏమిటీ వింతకాలం ?
రేపటి పౌరులైనన నేటి బాలలు నేర్చుకుంటున్నారు
లూటీలు, దోపిడీలు...
పెంచుకుంటున్నారు ఒకరిపై ఒకరు
విద్వేషాలు, కలహాలు....
అయ్యో....ఏమిటీ ప్రపంచం ?
నేటి యువకులు డబ్బిచ్చి కొంటున్నారు డిగ్రీల్ని
కానీ ఏం లాభం ?
విజ్ఞానం శూన్యం....బుర్రలో గుండు సున్నా....
ఏమిటో ఈ లోకం....?
మనిషంటే మనిషికి పడక,
మానవత్వాల్ని హత్య చేసేసుకుంటున్నారు...
నడివీధిలో నిలువునా ప్రాణాల్నే
తీసేస్తున్నారు....
అయ్యో... ఏమిటీ దారుణం?
మానవులే దానవుల్లాగా
అట్టహాసాలు చేస్తున్నారు
హంతకుల్లాగా విలయతాండవం చేస్తున్నారు
ఏమిటీ విపరీత బుద్ధులు ?
పురోగమనం పేరిట రాకెట్లలో కూర్చుని
చంద్రమండలాన్ని అధిరోహించేస్తున్నారు
అంచెలంచెలుగా విశ్వాంతరాళంలో
చొచ్చుకు పోతున్నారు
కానీ సాటి మానవుల్లోని మానవత్వాన్ని
మంటగలుపుతున్నాడు
అందరిలో ఈ వేదన కలిగేదెప్పుడు
కళ్ళు తెరిచేదెప్పుడో
మరి ఈ ప్రపంచానికి విముక్తి ఎప్పుడో.... ఎప్పుడో ? *

## ఊహా ప్రపంచం

అదిగో ఎలుగెత్తి పిలుస్తోంది
ఘరోల్లోకం

అదిగదిగో చెయ్యెత్తి మరీ పిలుస్తోంది
మరోలోకం
అక్కడందరూ ఒకటేనని ఎలుగెత్తి చాటుతోంది
ఆ ప్రపంచంలో నాయకులూ లేరు,
వినాయకులంతకంటే లేరు
ప్రజాసేవ పేరుచెప్పి మిద్దెలు కట్టే
మంత్రివర్యులు లేరు
ప్రజాధనమే స్వంత ధనమని ఆస్తులు పెంచుకునే
దొడ్డహృదయులు కానరారు
బొజ్జలు పెంచిన ధనవంతులూ లేరు,
కడుపు మాడిన బక్కటోళ్ళు అసలే లేరు
స్వార్ధ పరులు లేరు,
నీతిని, న్యాయాన్ని అమ్ముకునే అవినీతి పరులే లేరు
లంచాలు పుచ్చుకునే మహానుభావులు లేరు
లంచాలిస్తే పుణ్యాత్ములు మొదటికే లేరు
గడ్డాలు పెంచిన దొంగస్వాములు లేరు,
గుడిలో లింగాన్ని మింగే పూజారులే లేరు.
సంఘసేవ పేరుచెప్పి పేదల పొట్టలు కొట్టే
త్యాగ మూర్తులు మచ్చుకైనా కనిపించరు
పొరుగు పచ్చదనాన్ని ఓర్వలేని వారు లేనే లేరు.
అందుకే అక్కడ ఈర్షాసూయలు మాటకైనా కానరావు
మేకవన్నె పులులు లేవు,
పయోముఖ విషకుంభాలు లేరు
అక్కడ పట్టపగలు దోపిడీలు లేవు
హత్యలంతకంటే లేవు
తగాదాలు లేవు, కొట్లాటలు లేవు
అందుకే అక్కడ న్యాయస్థానాలూ లేవు,
పంచాయితీలు లేవు
అన్యాయానికి చోటులేని స్థానంలో
న్యాయస్థానాల ప్రసక్తే లేదు
జబ్బులేవు, జలుబులేవు
మరి మందులతో పనే లేదు
వైద్యుల అవసరమే లేదు
ఇక యింకా కులాల, మతాల గొడవే లేదు

విద్వేషాలకిక తావేలేదు
నడివీధిలో నగ్ననృత్యాలు లేవు
వీధివీధిలో రెచ్చగొట్టే నినాదాలసలే లేవు
తిరుగుబాటు దారులు లేరు, విప్లవ వీరులు కానరారు
మరో ప్రపంచం ఎలా ఉంటుందని ప్రశ్నిస్తే—
అది ఎప్పుడూ నవ వసంతం వెల్లివిరిసే
మరో ప్రపంచం
చిరునవ్వులతో జీవనం సాగించే
శాంతి కాముక ప్రపంచం
కరుణామయులకు మారుపేరుగా పెరిగే
దయామయుల ప్రపంచం
మమతా మాధుర్యాలు అందరిలా రంగరించుకొన్న దేవతలనబడే
మానవుల స్వర్గంలాంటి ప్రపంచం
భేదాలెరుగని, తారతమ్యాలెరుగని
అమాయక ప్రపంచం
మానవజాతే ఏకైక కుటుంబంగాగల
దివ్యమానవ ప్రపంచం
అందరి అర్హతల్ని సమంగా చూసే
మరో ప్రపంచం
కలతలు, కావేషాలెరుగని
నిష్కల్మష ప్రపంచం
నవ్వుతూ, నవ్విస్తూ తిరిగే నవయువకుల
నవ్వుపువ్వుల ప్రపంచం
నిస్వార్థత, నినాదాలుగా గల
అభ్యుదయ ప్రపంచం
కష్టపడి పని చేయుటే లక్ష్యంగా గల
ఆదర్శ ప్రపంచం
మానవసేవే మాధవ సేవగాగల
సేవాధర్మ ప్రపంచం
నవోత్సాహంతో ముందుకు సాగే యువతీయువకుల
నవ్యప్రపంచం
ఇదే ఇదే నేను ఊహించిన ఊహా ప్రపంచం
మరి యిదే అందరి భావి ప్రపంచం కావాలని నా తాపత్రయం *

## టి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి

### ఉగాది

పసిపాపల వదనం ప్రశాంత సదనం
మహోత్కృష్ట మానవతకదే గొప్ప నిదర్శనం.
కరుడుగట్టిన రాక్షసత్వాన్ని
మితిమీరిన దుర్మార్గాన్ని
క్షణంపాటు విలువగలుగు సమ్మోహనం.

పసిపాపల నయనాలు శాంతి దూతలు.
విశ్వశాంతి రక్షణకై దీక్షగొన్న నేతలు.
అధికమైన అణువిజ్ఞానం అనర్థాలే తెచ్చినా,
మానవత్వంలేని మహానాయకులేమైనా,
నిరవధిక దీక్షాపరతంత్రులీ శాంతి కపోతాలు.

పసిపాపల నవ్వులిచ్చు స్వేచ్ఛా సందేశాలు
స్వచ్ఛత, పరిపూర్ణతలే అందరి ఉపదేశాలు.
దానవత్వం బలిసిన నాగరికతకు
మనశ్శాంతి మృగ్యమైన మానవతకు
బుద్ధిచెప్పి వినిపిస్తాయి సృష్టికర్త ఆదేశాలు.

పసిపాపల హృదయం బ్రహ్మానందమయం
సౌకుమార్య సౌజన్యాలకది నిలయం.
మేధస్సును మథించి
యంత్రమయం చేసుకున్నా
తృప్తిలోపమున్న జాతికిది అతీతం.

పసిపాపల వారసుడు మానవుడే యైననాడు
విశ్వమంత వెలుగునిండు, శాంతిపండు
ఆనాడే విశ్వానికి అందమైన యుగాది
ఆనందం అర్ణవమైన ఉగాది.

*

## మదన గోపాల!

సీ. కుదుర్రైన వాడింక గోవిందుడనుకొని
పిల్లనిచ్చిన మామ పీచమడచి
మేనల్లుడని నిన్ను పిలువనంపిన మామ
బంపినావా నాడు స్వర్గమునకు
నిరతంబు నీనామ స్మరణంబు చేసెడి
జాంబవంతుని కడు జావబొడిచి
ముద్దుగామామను ముప్పుతిప్పలుపెట్ట
సత్రాజితుండుతో జావునొందె

గీ. మామలకు మాధవా! నీవు మారకుడవు
భామలకు నిత్యనూతన మారుడవయ!
సుజనపరిపాల! సన్నుత సుగుణశీల!
మదనగోపాల! రాధికాహృదయలోల!

సీ. తనయుడేశుని చేత దహియింపబడుచుండ
చూచుచుంటివటయ్య సొంపుమీర
చంచలచిత్తయౌ సతిని కాదనలేక
అదుపులో నుంచలేవదియె వింత!
వక్రగతిని మించి వర్తిల్లు కూతురు
మగని నెత్తెక్కిన వగవవింత
అల్లుడు నిత్యంబు నాకలితో మాడి
బిచ్చమెత్తగ నీకు మేలె? యదియు

గీ. ఏమి? నీకుటుంబమొ! యిది! యెంచిచూడ
వినెడివారలు నవ్వరే? వేదవేద్య!
సుజనపరిపాల! సన్నుత సుగుణశీల!
మదనగోపాల! రాధికాహృదయలోల!

సీ. తరుణిని దునుమాడి తపసులగాచుట
రాతిని నిలలోన నాతిజేయ
త్రుప్పుపట్టిన విల్లు దోరమై విరచుట
ఘుసళిభాషని పట్టి పస ధిగ్భుళ్ల

చెట్టుచాటుననుండి యెట్టొ కోతినిగొట్టి
తోకమూకల చెఱ్ఱి వీఁపఁజేయు
పండుముసలిబట్టి గుండెపగులగొట్టి
నిజభార్యనే వీడి నిరతిగనుట
గీ. గొప్పలెన్నడు కావు నీవెప్పుడిట్లు
చెప్పుకొనకుము మిక్కిలి సిగ్గుచేటు. ॥సుజన॥
సీ. నీ భక్తులందరు నిరతంబు విగ్గొల్చి
వనచరులైరయ్య వనరుహాక్ష!
మఱుజన్మమందున మదిరాక్షులై చాల
యవమాన మందిరి యవనిలోన
బరగి సన్యాసులై తిరుగమరగి జాల
బుద్ధులయ్యు నపరిశుద్ధులైరి
కలికాలమిది నింక పలుకనోరాడదు
ఇకమీద నిక్కట్లు సెన్నిగలవొ!
గీ. ఇన్నిపాట్లయ్యె నీ భక్త బృందమునకు
చాలు! నీ సేవకొక నమస్కారమయ్య! ॥సుజన॥
సీ. పాలీయబోయిన పడతిని పరిమార్చ
మని శాస్త్రమేదైన మహినిజెప్పె?
ప్రక్కింటి పెరుగును, పాలను త్రావంగ
నే ధర్మములు నీకు నేర్పె జెపుమ!
స్నానమాడెడువారి వలువలు దాయంగ
నే వేదములు చెప్పె నీకు చెపుమ!
ప్రేమతో పిలిచిన మామను జంపంగ
నేయుపనిషత్తులు నీకు జెప్పె!
గీ. తెలిసికొని నిన్ననుకరింప తలపుగలదు
నేటి లోకంబునకు గాన తేటపరచు ॥సుజన॥
సీ. తక్కతకాయని తైతక్కలాడెడు
నటకుండు నీయల్లుడటులజూడ
అన్న, బావమరది, ఆత్మజుండును, నీవు
విటులన్న సంగతి విదితమేగ!

కోడలు, మనుమడు, ఘోటకభక్తుడు
గాయకులని పేరుగలడు భువిని
గూఢమౌ కవితకు కోడలే నిధియన్న
సంగతెల్లరకును జాలతెలియు
గీ. అవని నటవిటగాయక కవులనెప్డు
జేరనీయంగరాదని చెప్పుచుంద్రు!
నీకుటుంబమునకు స్థాన మెవ్వరీక
పోవుటుచితంబుగాదె? యో భోగిశయన ॥సుజన॥
సీ. కురురాజు సభలోన కోతలెన్నియొకోసి
విఫలమౌ నీ ప్రజ్ఞ విదితమయ్యె?
అల జరాసంధుని యనిజాకువేళలో
బయలుపడియె నీదు బలమదెంతో?
ఏమిలేకయు దానవేంద్రుని యాచింప
యపగతంబయ్యె నీ యాస్తి యెంతో?
ముక్కోపి భార్యచే పెక్కుతన్నులుతిన్న
నీ తెల్వియంతయు తెల్లమయ్యె?
గీ. చాలు చాలయ్య! నీవిటు చాలవయ్య!
భారతదేశాన నీవెట్లు బ్రతుకగలవు? ॥సుజన॥
సీ. శత్రువర్గంబును జంపబూనుటమాడ
నీవిద్యలేకదా! నీరజాక్ష!
మిత్రులనందర పాత్రమౌ పదవుల
నిలుపుట నీ ప్రజ్ఞ! పొలుపుమీద!
భక్తులందరకును భుక్తిలోటును లేక
యుండునట్టుగ చూచుచుందు నీదె?
బాంధవులందరు పల్గారవములంద
నీ యుక్తిగాకేమి? తోయజాక్ష!
గీ. ఇదియె ప్రత్యక్షమయ్యెను పదపదాన
నిన్ను చూచియే యివియన్ని నేర్చుకొనిరి!
సుజన పరిపాల! సన్నుత సుగుణశీల!
మదనగోపాల! రాధికాహృదయలోల!

# అయ్యదేవర పురుషోత్తమరావు

## ఒక్కొక్కప్పుడు...

వికసించిన కుసుమంకాదు_జీవితం;
ఆనందంగా ఆఘ్రాణించడానికి.
పడ్డించిన విస్తరిగాదు _ జీవితం;
ఆతురతతో ఆరగించటానికి.
అనాయాసంగా పయనించటానికి _
జీవితం పరచిన రహదారికాదు.
నిరాఘాటంగా అధిరోహించడానికి;
జీవితం కేవలం నిచ్చెనలేవున్న పరమపద సోపానం కాదు.
జీవితం మెత్తగా పరిచిన పట్టుపాన్పుకాదు;
హాయిగా సుఖనిద్రపోవటానికి.
జీవితం అపుడే తీసిన ఫలరసాయనం కాదు;
అనాయాసంగా ఆస్వాదించడానికి.
వలచివచ్చిన వధూటికాదు_జీవితం;
అనువుగా అనుభవించటానికి.
జీవనదికాదు_జీవితం.
ఆనందంతో జలక్రీడలాడడానికి.
కోర్కెలుతీర్చే కల్పవృక్షంకాదు_జీవితం;
ఇష్టకామ్యార్థాలు తీర్చుకోటానికి.
జీవితం సశరీర స్వర్గంగాదు
జన్మసార్థక్యాన్నందుకోడానికి.
జీవితం అమర్చిన రంగస్థలంకాదు
విశ్చింతగా నాట్యమాడి నిష్క్రమించటానికి.

* * *

కంటకావృత కుసుమం_జీవితం;
మెలకువగా చేజిక్కించుకోవాలి.
విషకలుషితోగిరం_జీవితం

విరుగుడు తెలిసీ వీందారగించాలి.
జీవితం కీకారణ్య బ్రహ్మారణ్యం;
చొచ్చుకొని సాగిపోవాలి
జీవితం కాలసర్పంగల వైకుంఠపాళి
దాని వాతపడకుండా దాటుకోవాలి.
జీవితం మశకమత్కుణాల పలసమంచం
మైమరచి నిదురించరాదు
పులిసిన ఫలరసాయనం-జీవితం;
తరుణం తెలిసి ఆస్వాదించాలి.
వలచివచ్చిన విషకన్య-జీవితం;
విరుగుడు తెలిసి చేరాలి.
జీవితం శివజటాజూట నిర్గత గంగాస్రవంతి
భగీరథప్రయత్నం చెయ్యాలి
జీవితం గారడీవాని మామిడిచెట్టు
శాశ్వతరూపం దానికి కల్పించుకోవాలి
జీవితం భయంకర మహానరకం
స్వర్గతుల్యంగా మలచుకోవాలి
జీవితం చెదరిన రంగస్థలం
కుదురుగా కుశీలవుడవు కావాలి.

*

## కాలం

కాలం కనిపించని వలయం
ఉన్నవాడికి ఉచ్చైశ్శ్రవం-ఐరావతం.
లేనివాడికి శుష్కశునకం-కాలవరాహం.
గతం మాసిన గర్భవేదన
వర్తమానం చిగురు
భవిష్యత్తు ఆశాకుసుమం
నిన్న నేటికి అనాది
నేడు రేపటికి పునాది
రేపు ఆశకు ఉగాది

అరుణోదయం ప్రకృతి పారవశ్యం
ఉదయం వినూత్న సంచలనం
మధ్యాహ్నం చండప్రచండం
సాయంత్రం అంతుతెలియని కలకలం
చీకటి చిత్తచాంచల్యం
చంద్రదర్శనం హృదయోల్లాసం
వేగుచుక్క కవితావేశం.

## ఒక్కటే

కన్నులు రెండైనా చూసే చూపు ఒక్కటే
వీనులు రెండైనా వినే ధ్వని ఒక్కటే
ముకు పుటాలు రెండైనా ఆనే ఆఘ్రాణం ఒక్కటే
పెదవులు రెండయినా పలికే పలుకు ఒక్కటే
చేతులు రెండయినా చేసే చేత ఒక్కటే
కాళ్ళు రెండయినా సాగేనడక ఒక్కటే
చక్రాలు రెండయినా నడిచేబండి ఒక్కటే
నింగీ నేలా రెండయినా ప్రకృతి ఒక్కటే
రాత్రీపగలూ రెండయినా రోజు ఒక్కటే
పడుగుపేక రెండయినా పొందు ఒక్కటే.

## మహామనీషి

సాహితీ విహాయసంలో మధ్యందిన మార్తాండుడు
మహోజ్జ్వలంగా జ్వలిస్తున్న దుర్నిరీక్ష్యుడు
ప్రాక్పశ్చిమ రసార్ణవోద్భూత జలదమై
మధురకవితా ధారలను కురియింప చేస్తున్నాడు
సాహితీ క్షేత్రాన్ని సస్యశ్యామలం చేస్తున్నాడు
రససరసిని రంజింప చేస్తున్నాడు
సుకవితా కావ్యకమలాలను వికసింపజేస్తున్నాడు
కుకవితా కైరవాలను ముకుళింప జేస్తున్నాడు
అంబరచుంబి శిఖరాగ్ర శృంగసంకాశ

స్మృతిసంతతులను వెలయింప చేస్తున్నాడు
అచ్చర కన్నెలను లాస్యమాడిస్తున్నాడు
అధునాతన సనాతన సంప్రదాయాల నడుమ
నిలచివున్న త్రివిక్రమావతారుడు
ప్రాచీనాధునిక కవితాస్రవంతికి సేతువై నిలచినవాడు
సాహిత్యారామంలో
కల్పవృక్షాన్ని పాదుకొల్పి
రామకథను మరలచెప్పి వాల్మీకి అయినాడు
కిన్నెరసానిని తేనెవాగుగా పారించి
ధర్మార్థాల చెలియలికట్ట చూపి మనీషి అయినాడు
వేయిపడగలస్వామిని వెలయింపచేశాడు
ఆరునదులకు వంతెన వేశాడు
విష్ణుశర్మకు ఇంగ్లీషు చదువు చెప్పాడు
మ్రోయు తుమ్మెదను వినిపింపజేశాడు
నేపాళ రాజవంశ కథలల్లాడు
పురాణవైరుల చీల్చి చెండాడాడు
అద్వైతమునకాది శంకరులట్లు
సంప్రదాయ సాహితిని సముద్ధరించాడు.
జ్ఞానపీఠం అధిష్ఠించాడు
శిష్యప్రశిష్యులకు అండగా నిలిచాడు

* * *

ఆతని పలుకు దారుణాఖండల శస్త్రతుల్యము
మనసు నవ్యనవనీత కుసుమ కోమలము
ఆతను సాటిలేని సాహితీ సామ్రాజ్య సమ్రాట్టు
విశ్వకవితావిపంచిని మీటిన రసరాట్టు
తెలుగుజాతికి గర్వకారణము
తెలుగు తల్లికి పున్నెములపంట
ఆతడుత్తుంగ హిమవన్ శృంగము
ఆతడు మహామనీషి.

* * *

# పింగళి జగన్నాథరావు

## రావమ్మా!

ఓ!
తుహినకర సంజనిత సుకుమార చంద్రికా
జితధాళధళ్య ధవళప్రభా!
సాహిత్య కాసార కల్లోలమాలికా
సంచరత్కమనీయ కావ్యాత్మికా! రావమ్మా!!
రావమ్మ భారతీ! రమ్ము రమ్మో జనని!
నా హృదయసీమలో నొదిగి యుండగ రమ్ము!!
దివినుండి స్వర్గమ్ము భువికిజారిన యట్లు
పువ్వు తన తనువెల్ల పుల్కరించిన యట్లు
పికము తన కంఠమ్ము సవరించుకొనినట్లు
ప్రమథనాధుడు పదము కదిపి యాడినయట్లు
నవ్వులేరాసులుగ చేసిపోసినయట్లు
యౌవనము ఫెళ్ళుమని ఒళ్ళు విరిచిన యట్లు
మింటిపై తారకలు మినుకు మినుకనినట్లు
అలవసంతమ్ముతా నావరించిన యట్లు
ఘలు ఘల్లుమని పాద మంజీరములు మొరయ
కటిసీమ సింజాన మేఖలమ్మది మెరయ రావమ్మ భారతీ...
నును మంచుతెర మించు సరిగంచు తెలిచీర
కుచ్చెళ్ళు తరగలై పృథివిపై(బారాడ
పాల సంద్రములోన పడిలేచి పరతెంచు
కెరటాలవలె కెఱలు చిరునగవు దొంతరలు
చూచి నాహృదయమ్ము పరవశమ్మైపాడ
నాలోన కవనమ్ము నాగువలె కదలాడ రావమ్మ భారతీ....
సకల నిర్జరలోక సన్నిధానములోన
ఝణుత తకఝణుత యను తాళవిన్యాసాన
నటియించు రంభయే దిగులు పడియెడురీతి
దివినుండి ముక్కంటి శిరసుపై దిగివచ్చు
దివ్యభాగీరథీదేవి చాడ్పున నీవు
తొలిపల్కు లొలికించు రతనాలవీణలో

కిణ కిణాత్కారమున కింకిణీరవమొలయ రావమ్మా....
సురతరంగ కెరటాలు పరుగులెత్తినరీతి
ఘనసార మెల్లెడల కలయజల్లినరీతి
కుందమందారములు కుప్పవోసిన రీతి
కకుబంతమౌ ధవళ కాంతి సొంపెసలార
సురపారిజాతాల సౌరభము తనరార రావమ్మ భారతీ....

జీమూతమండలము జిలుగువెలుల వెడలి
తళుక్కుమని చనుదెంచు సౌదామినీ లతవోలె
కర్ణతాటంకాల ధాళ ధళ్యపురుచులు
చెక్కిళ్ళ హరిచాప ఖండములవలె వెలుగ
పిల్లతెమ్మెరవోలె మెలమెల్లగా నీవు రావమ్మ భారతీ....

అళినీ గరుచ్ఛాయ నలరారు ముంగురులు
నిండు జాబిలి వంటి నెమ్మోముపై ముసరి
మకరంద భ్రాంతితో కొదమతుమ్మెదగములు
కొసరి కోరికతోడ మోముదామరమీద
ఝంఝుము ఝంఝుమ్ము ఝుమ్మురని చెలరేగు
చిన్నవాయను వేడ్క చూచువారికి కలుగ
అరుణాంగుళులు కురుల నలవోక వెన్నుద్రోయ
గూడు కట్టిన కవిత నా గుండెవాకిలితీయ రావమ్మ భారతీ...

శరదిందు చంద్రికా శీకరమ్ములలోన
మత్తుగా జగమెల్ల నిట్టూర్పు సమయాన
పుల్కరించిన ఒడలు విరిచితీయగ నిలిచి
తన ప్రక్కనున్నట్టి చుక్కలను గికురించి
కలువరాయడు తనదు కరములల్లన జాచి
జిలుగుజిలుగున యెదకు ఇడిన గిలిగింతలతో
వొలయలుక నటియించు కలువ కన్నియ పెదవి
సిగ్గుతో చిరునవ్వు చిలుకరించినవేళ రావమ్మ భారతీ!

సాంద్రమౌ గిరిసాను సోపాన మార్గాల
నిస్తంద్రమౌ మంద్ర నాదమ్ముతో మేను
కుదిలించి భూదేవి ఒడిలోకి జారేటి
గలగలా పారేటి సెలయేటిజాణపై
ఎదలోన వేవేల వేణువుల్ మ్రోగగా
పిదప అంగములెల ముదముతో పులకింప రావమ్మ భారతీ....

జాబిల్లి చల్లగా నవ్వుకొను సమయాన
పిల్లతెమ్మెర మెల్లగా వీచుసమయాన
లతలు సంతోషాన తలలూచు సమయాన
జతగూడి ప్రేమికులు రసియించు సమయాన
పూలతావులు దెసల పారాడు సమయాన
కలువ కన్నియ పెదవి చిరునవ్వు సమయాన
బృందారకేశ్వరులు సుమవర్షములు కురియ
రసలోక సమ్మోహ వల్లకీరవమొలయ
రావమ్మ భారతీ! రమ్ము రమ్మో జనని
నా హృదయసీమలో నొదిగియుండగ రమ్ము !!

* * *

బాలభానుని లేత పసిడి కిరణాలు
యెదకుసోకగ కోటి ఇంద్రధనువులు విరియు
హిమబిందుతతిలోన నీరూపమును తలచి
నిలువెల్ల పులకించి నింగితాకగనేను రమ్ము రమ్మో జనని.
సంధ్యారుణాతప సంఫుల్లరాగములు
పసుపుకుంకుమలీయ చామీకర ప్రభల
కొండలను ఢీకొంచు తృళ్ళింతలిడుకొనుచు
సెలయేటి నెచ్చెలుల గలసి నడచుచును
కఠిన పాషాణముల కదలికలు పుట్టించు
గంభీర ఘోషముల ఫెళఫెళార్భటులఁ
లంఘించు జలపాత తీరదేశములందు
కలలన్ని కలబోసి నిన్ను తలపోసి
నిలిచియుండిన నాదు యెదను కాపురముండ రావమ్మా....
ఓ!
పరిహసితస్మర ధనుస్సౌష్ఠవభ్రుకుటీ
దరచలత్కల్యాణ చాంద్రీపుటీ !!
చలువరాసానపై పసుపు నిగులమంచి
బంగారు ఖండమును పగడాలతో కలిపి
అలరారు తేనెలో అరిగించినటులున్న
మైచాయతో కనుల వెలుగు వెల్లువనింప
అందమున కమ్మవై అపరంజి బొమ్మవై
విరబూచుకొమ్మవై కపురంపు దిమ్మవై
రావహో! రావహో! రావహో నా జననీ!

రంజిల్ల రతనాల మంజీరముల రవళి ॥
అలలు అలలై తేలు మలయమారుత వీచి
నెలరాజువలెనున్న మోముపై నలరారు
చికురాల నలవోక నుయ్యాల లూపగా
మంధరాచల మథ్య మానమౌ దుగ్ధాబ్ధి
వెడలి పువుదండతో నొయ్యారములు చిలుకు
ఇందిరా సుందరియొ యనునట్లు మెల్లగా
రావహో రావహో రావహో నా జనని ।

తరగలై చిరునగవు పగడాల జడికురియ ॥
అరవిందములతావి అవతరించిన యట్లు
ఇంద్రచాపము ఒడలు విరిచి నిలిచినయట్లు
తుహినాంశు గిలిగింత కలువ నవ్వినయట్లు
పాలవెన్నెలలు జగమెల్ల పరచినయట్లు
తరళబుద్బుదచ్ఛటల సప్త వర్ణాకృతుల
కెరటాలవలె కదలు కుచ్చెళ్ళవెనువెన్క
హంసములవలె రెండు పాదములు నడయాడ
రావహో రావహో రావహో నా జనని ।

వెల్లువై మదిలోన మల్లెపూవులు విరియ ॥

* * *

వేదత్రయీ శిరోభాగన ర్తన చరణ
మణికింకిణీరణన కావ్యస్వరా ।
అరుణాంగుళీవిచలితమ్మృదు వల్లకీధ్వాన
నిర్ముక్తగాంధర్వవిద్యామయీ ।
హిమబిందు సందోహసితపుల్లకల్హార
రమణీయ దివ్యస్వరూపా ।
వరాగమారంభవేళానభస్స్ఫుర
త్తటిల్లతికాయమాన దివ్యత్ప్రభా ।
భారతీ ।....రావమ్మా....

* * *

# వంగపల్లి విశ్వనాథం

## '...ఈకథ వినిపిస్తానుండు!'

కనురెప్పకూ కనురెప్పకూ మధ్య
నా కంటిపాపకు తోడు_నిజంగా నా కంటిపాప తోడు
కాపురమున్నట్లున్న నీతో_ఏం చెప్పుకోను! ఏందాచుకోను!!

*

నీ కళ్ళలో అనంత విశ్వాన్ని చూస్తున్నాను
ఎక్కడైనా, నేనున్నానేమో అనుకుంటూ వెదుక్కుంటున్నాను.
నీ కలువవి కనురెప్పలమధ్య కంటిపాపలో
నా ప్రతిబింబమే కనబడుతోంది
ఏం! ఈ సమస్త ప్రపంచమూ నిన్ను అవలోకించడానికి
నేను అడ్డునిలవడం లేదు గదా!

*

నీ అందం చిదిమి, దీపంపెట్ట వచ్చునంటారు
రా! నా యింట దీపం పెడుదువుగాని.

*

దీపాలుపెట్టే వేళకు వస్తానన్నావు
పెట్టిన దీపం కొడిగట్టుకు పోతోంది
నీవురాలేదు_నీ మాటలపై విశ్వాసం ఆరిపోతోంది.

*

గాలికి ఊపిరాడడంలేదు_ఉక్కిరిబిక్కిరౌతోంది
నీటికి దాహమనిపిస్తోంది_సతమతమౌతోంది
నిప్పుకు చలికాచుకోవాలనిపిస్తోంది_తహతహలాడుతోంది
దీపానికి దారితెలియడం లేదు_తడబడుతోంది
ప్రకృతి పాడుకోవడంలేదు_పాట మరచినట్టుంది
నా కలలలోకి నీవురావడమేలేదు_నీవు కలగనడం మానినట్లుంది.

*

ఈ రాత్రి అన్నిరాత్రుల వంటిదీ కాదు
ఇలాంటి రాత్రి ఎప్పటికోగానీరాదు
ఈ రాత్రి అనే ఒడ్డుకు

ఈవలివైపు సంధ్య, ఆవలివైపు ఉష
కళ్ళు నులుముకుంటూ చూస్తున్నారు

*

ఏనక్షత్రాలనైనా అడుగు–రాత్రినేనెలా గడిపానో చెబుతాయి
ఏ పువ్వునైనా అడుగు–నీ వూసే తనవాసనంటుంది
ఏ ముల్లునైనా అడుగు–నా ఎదయే తన నివాసమంటుంది.

*

నాడు మల్లెతోట
నేడు మధుశాల
రేపు మఠం
–ఎంత చేశావు ? నిన్ను నమ్ముకున్నందుకు

*

ప్రపంచ భగ్నప్రేమికుల మహాసభ జరుపుతున్నారు
నన్ను అధ్యక్షునిగా రమ్మని ఆహ్వానించారు
ఎంతగౌరవం దక్కిందో చూశావా–నిన్ను ప్రేమించినందుకు

*

ఉండు–
నన్నుదయతో చూసి
నిన్నుకసితో తిట్టుకునే
జాలిగుండెగల లోకానికి
ఈ కథ వినిపిస్తానుండు *

## "నన్ను మరచి"

ప్రేమతో చెక్కిళ్ళను, కనురెప్పలను ముద్దాడి
'ఆకలేస్తోందా నా తండ్రీ' అంటూ లాలనగా అడిగి
ఎదవిప్పి పయ్యెదగప్పి, 'ఇందపాల'ని నన్ను కడుపారా పాలు త్రాగనిచ్చి
ఆనందంతో అమృతంతాగి జీవనం నింపుకుంటున్ననన్ను తృప్తిగా చూసి
మురిసిపోయావు
ఇంకా నిద్రపట్టని నన్ను
చిరునవ్వుతో దీపం వైపూ, నవ్వుతున్న నీ కళ్ళల్లోకి
చూస్తున్న నన్ను
ప్రేమతో హృదయానికి హత్తుకుని
ఆక్షణంసేపట్లో నీమనస్సులో మెదిలిన మధురజ్ఞాపకాల స్పర్శలకు పుం కించి

'ఇంకా నిద్రరాలేదా నాన్నా' అంటూ బుజ్జగించి
భుజాన వేసుకుని, నన్ను జోకొట్టావమ్మా.

*　　*　　*

బహుశః ఎవ్వరు అడిగినా వెంటనే పాడి వుండవు
నేను అడగకుండానే, జోలపాట పాడేదానివి
నీ పాటవింటూ, నీవు ప్రేమతో జోకొట్టుతున్న చేతికి ఊతగా
ఊః అంటూ అంటున్న నన్ను
'అరి, దొంగా ! ఇంకా నిద్రపోలా ? నిన్నెంత సేవు ఎత్తుకుతిప్పాలేవిటి?'
అంటూ గోముగా అడుగుతున్న నిన్ను చూసి
నీవడుగుతున్నదేమిటో అర్థంకాక
అమాయకంగా నీవైపే చూస్తూ
ఈః తల్లిపాట ఎందుకు ఆపివేసింది చెప్మా అని
ఆశ్చర్యపడి నోరు తెరిచి చూస్తున్న నన్ను
మరోసారి, మనసారా ముద్దాడి
ఇక ఇలా లాభంలేదు అంటూ ఉయ్యాలలో పడుకోబెట్టి ఉయ్యాలూపావమ్మా
ఆ రోజు నాకు గుర్తుంది.
అలా ఉయ్యాల ఊపుతూ_నాకన్నా ముందే నీవు నిద్రపోయావు.
అప్పుడప్పుడే కొద్దికొద్దిగా నిద్రపట్టి,
కనురెప్పలు మూసుకోవడం మొదలెట్టాయి.
(నీకు అప్పుడే మెలుకువ వచ్చినట్టుంది)
నన్ను నెమ్మదిగా ముద్దుపెట్టుకుంటే
ఒక్కసారి ఉలిక్కిపడ్డానమ్మా
"పాపం ! నిద్ర చెడిపోనా" అనుకుని కాబోలు
మరి కాస్సేపు ఉయ్యాల ఊపావు
ఆ పాటకు ఆ ఊపుకు నేను నిద్రపోయే వుంటాను.
అప్పుడే కనులు తెరచి
నేనుంటున్న కలల లోకాలనుండి ఇంకా దిగిరాని నన్ను
నీ చేతుల్లోకి తీసుకుని, గాలిలోకి ఎగురవేసి
నా చిన్నిచేతులతో గట్టిగా నీకొంగును గొలుసును పట్టుకున్న నన్ను చూసి
'నీకెంత భయంరా' అంటూ గుండెలకు హత్తుకున్నావు
నాకు ఊపిరి సలపకుండా ముద్దులు కురిపించి
నా దిక్కే తదేకంగా చూస్తూ ఊపిరి పీల్చని శిల్పంలా
ఆలోచనల పిలుపునందుకని ఏ మధుర స్మృతులలోకో జారిపోయావు
....నన్ను మరచి.　　*

## ''మాట్లాడని జవాబు''

"నీ ఆలస్యాన్ని నిర్లిప్తంగా, నీ మౌనాన్ని అనిష్టంగా,
మనసులో చిత్రించుకొని, ఇప్పుడిప్పుడే ఏర్పడుతున్న అనుమానాలు
స్థిరనివాసాలుగా ఏర్పడకముందే, పలుకరించడం మంచిదేమో...."
అంటూ, గట్టిగా హెచ్చరిక చేయాలని అనిపించిన భావాన్ని–
ఎంత బలంగా మనసులోకి నెట్టివేసుకున్నానో–నీకు తెలీదు
విపరీతమైన ఆలస్యాలు, అన్యాయమైన నిశ్శబ్దాలు
నానుండి నేర్చుకున్నవే కావచ్చు.
కానీ ఇలా నాకే అప్పచెప్పడానికి నేర్చుకుంటావని అనుకోలేదు
వెధవ బ్రదుక్కి–దొక్క– పిచ్చి.
అందుకే, మానసికంగా బలహీనులు మనుగడసాగించడం కష్టం.
నీ ఆలస్యం – నీ మౌనం – నీ నిర్లిప్తత–
వీటికి కారణాలేమిటో–అర్థమేమిటో–
నీవు చెప్పగలుగుతే–చెప్తే–చెప్పదలుస్తే–వినాలని ఉంది.
ఎంత ఆలస్యంగా చెప్పినా, ఓపికగా ఉండి వినే ఓపిక ఉంది.
కలతపడ్డ మనసు, కలవరపడడమూ సహజమే.
కానీ, చేసిన నేరం చెప్పకుండా, ఇలా శిక్షించడం–
ఏ శిక్షాస్మృతి ప్రకారం చూసినా న్యాయంకాదేమోనని నా అనుమానం.
ఇంత కోపం వెనుకా....చిరాకు వెనుకా....
నీ వెలాఉన్నావోనని, నీ ఆరోగ్యం ఎలాఉందోననీ–నా ఆరాటం.
ఎవరూ ఎవరికీ చేయగలిగిందేమీ లేకపోయినా–
అర్థంకాని, బహుశః అర్థంలేని ఊహలు.
ఎవరికివారు, ఎవరికివారే బ్రదుకగలుగుతే––
ఈ అభిమానాలపేరిట పెంచుకున్న బలహీనతలు,
బలంగా ఏర్పడకుండేట్లు ముందునుండీ ప్రవర్తించగలుగుతే–
మనిషి మనసు మరోలా ఉంటుంది.
అలా, మరోలా బ్రదకడం అలవాటు లేక,
ఇప్పుడు నేర్చుకోవడానికి ఇష్టంలేక–
మనసు నిశ్శబ్దంగా పడుతున్న ఆరాటానికి, ఇది అక్షరాకృతి.
"క్షేమం అన్నయ్యా" అంటూ–ఒక్క–సారి పలికినా చాలు.
నిన్ను విసిగించను–నిన్నిక విసిగించను.
ప్రేమతో, శుభాకాంక్షలతో.... *

* * *